# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంగాదు

చిన్నపిల్లకు టైపుచేయుట నేర్చుకొనుటకంటె ఇంకేదీ ఎక్కువ సరదా కాదు. తాను నేర్చుకుంటినిగదా అని ఆమె సర్వదా సంతుష్టి పడుతుంది.



మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్లు మరియు పసుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పసుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పసుచిగుళ్లను ఫోర్‌హాన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరుచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హాన్స్' పసుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హాన్ యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయెడల పళ్లు తెల్లగా మెరయుచూ, పసుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




C. I

**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ____________________

*Address* ____________________

____________________

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.


**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956**

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS' 2 & 3, Arcot Road, Vadapalani. Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY 1st of each Calendar month |
| 3. *Printer's Name* | : | B. NAGI REDDI, Managing Director, The B. N. K. Press (Pvt.) Ltd. |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 4. *Publisher's Name* | : | B. VENUGOPAL REDDI, Managing Partner, Sarada Binding Works |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 5. *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 6. *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS : PARTNERS, 1. Sri. B. Venugopal Reddi. 2. Smt. B. Seshamma. 3. Smt. B. Rajani Saraswathi. 4. Smt. A. Jayalakshmi. 5. Sri. B. L. N. Prasad. 6. Sri. B. Viswanatha Reddi. 7. Smt. K. Sarada. 8. Sri. B. Venkatrama Reddi, *(Minor)* |

I, B. Venugopal Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*1st March, 1965*

**B. VENUGOPAL REDDI,**
*Signature of the Publisher*

## ఎవరెస్ట్ టైనీటాట్‌తో పిల్లలు ఉల్లాసంగా వెళ్ళుతున్నారు

ఒక షోకైన చిన్న వాక్యూం ఫ్లాస్కు–స్కూలుకు వెళ్లే పిల్లలు వారి కిష్టమైన వేడి లేక చల్లటి ఆహారాన్ని, పానీయాలను తీసుకు వెళ్లటానికి గాను ప్రత్యేకంగా డిజైను చెయ్యబడ్డది. ఈ టైనీటాట్ ఎవరెస్ట్ వాక్యూం ఫ్లాస్కులకు గల అన్ని విశిష్టాంశాలను, నాణ్యమైన సామగ్రిని కలిగియుంది. మీ బిడ్డకు స్వంతానికి ఒక టైనీటాట్‌ను తెచ్చిపెట్టరా ? గర్వకారణమైన ఇట్టి వస్తువులు శక్తివంతమైన వ్యక్తిత్వాన్ని పొందగలట్లు అతని దృక్పథాన్నే మార్చ తోడ్పడగలవు. "బిడ్డ మనిషికి తండ్రి" అని కదా నానుడి!

# EVEREST
# TINY TOT






MODEL
**TINY TOT**
Capacity : 250 cc

## విక్టరీ ఫ్లాస్క్ కంపెని ప్రైవేట్ లిమిటెడ్,

బొంబాయి ★ కలకత్తా ★ ఢిల్లీ ★ మద్రాసు

Vapi-6/63

రుచికరమైన ఆహారమునకు

# తుషార్ వనస్పతి

ఎ, డి విటమినులతో బలపరచబడినది




తుంగభద్ర ఇండస్ట్రీస్ లి. కర్నూలు

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ:

# మా కాపురం పాడయ్యేది

అలసటతో, నిరుత్సాహముతో,
బాధపడుతున్నా నేమో సంసారములో
సుఖమేమిటని మెట్ట వేదాంతములో పడి
సంతోషాన్ని పోగొట్టుకొన్నాను






అదృష్టవశాత్తు, ఒక రోజున మేము డాక్టరు దగ్గరకు వెళ్ళేము. శ్రమ మరియు వ్యాకులత శక్తిక్షీణతకు చిహ్నములని ఆయన చెప్పేరు. నేను ప్రతి రోజూ హార్లిక్స్ త్రాగుతే మళ్ళీ ఆరోగ్యమును, ఉత్సాహమును పొందగలనని ఆయన అన్నారు.



నేను హార్లిక్స్ త్రాగడము ప్రారంభించేను. అది చిట్కాలా పనిచేసింది. కొన్ని రోజులలోనే నేను శక్తి ఉత్సాహములను పొందేను. ఇప్పుడు నాకు చురుకుగా ఉండుటలోని రహస్యము తెలుసును కనుక నేనింక మళ్ళీ నిరుత్సాహమును దగ్గరకు రానీయను!




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

ప్రముఖ తారాగణముతో
ప్రఖ్యాత సాంకేతిక నిపుణులచే
ప్రశంసనీయముగా నిర్మింపబడిన
ప్రసిద్ధ పౌరాణిక పుణ్య కథ...







విజయా వారి

# సత్య హరిశ్చంద్ర

దర్శక నిర్మాత
కె.వి.రెడ్డి, B.Sc (HONS)

రచన..పింగళి నాగేంద్రరావు · సంగీతం..పెండ్యాల · నృత్యం..పసుమర్తి
కళ..గోఖలే, కళాధర్ · కెమెరా...కమల్ ఘోష్






మనోహరమైన
ముఖలావణ్యమునకు
నేషనల్ వారి
కాశ్మీర్ స్నో




Kashmir



సినిమా
తార లందరకు
నచ్చినది
ది నేషనల్ ట్రేడింగ్ కంపెని, బొంబాయి-2 • మదరాసు




అలంకారానికి
శారదా
ఆభరణములు
(రిజిష్టర్డు)
బంగారు కవరింగ్ చేయబడినవి.
మా శారదా నగలను కొనిమీధనాన్ని
పొదుపుచేసి గౌరవప్రదమైన
జీవితాన్ని పొందగలరని
ఆశిస్తున్నాము.
JASMIN NECKLACE
NO. 211.



NO. 826.



NO. 819
NO. 825.














NO. 602.
NO. 747.
NO. 607



NO. 542.



NO. 15.
A.V.RAO
శారదా గోల్డు కవరింగ్ వర్క్సు REGD.
prop. G.V. సత్యనారాయణమూర్తి & సన్సు
చిలకలపూడి, పోష్టు, మచిలీపట్నం, ఆంధ్ర.

# దిలీప్ బృందం సినిమా చూస్తున్నారు




















అబ్బాయిలూ! ఫిల్ము తెగిపోయింది! నాకు బాగుచేయటానికి దీపం కావాలి! మీలో యెవరైనా స్విచ్చి వేస్తారా?....




అంతే, బాగయింది! అందుబాటులో టార్చి ఒకటుండటం ఎంత అదృష్టం!

భలే! మన మిప్పుడు సినిమాను పూర్తిగా చూడవచ్చు!




JWT-UC 2241

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

జనవరి మాసాంతంలో భారతదేశ మంతటా రెండు ఉత్సవాలు జరిగాయి. జనవరి 26 న స్వాతంత్ర్య దినోత్సవం చేసుకున్నాం. ఈ స్వాతంత్ర్య దినం 35 ఏళ్ళనాటిది. 1930 జనవరి 26 న జవాహర్లాల్ నెహ్రూ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉండి కాంగ్రెసు లక్ష్యం సంపూర్ణ స్వాతంత్ర్యమని విస్పష్టంగా ప్రకటించాడు. అందుచేతనే జనవరి 26 ను మనం స్వాతంత్ర్య దినంగా పరిగణిస్తున్నాం.

ఈ యేడు జనవరి 28 నాడు భారతదేశం లాలా లజపత్‌రాయ్ శతజయంత్యుత్సవం జరిపింది. స్వాతంత్ర్య సమరాన్ని నడిపిన మహానాయకులలో "పంజాబ్ కేసరి" లజపత్‌రాయ్ ఒకడు. మనం ఇలాటి వీరుల సంస్మరణ ద్వారా జాతీయైక్యతను కాపాడుకుంటూ ముందుకు పోగలుగుతాం.

సంపుటి : 36 - మార్చి 1965 - సంచిక : 3

CHITRA



# భారత చరిత్ర




హుమాయూన్ అనంతరం పాదుషాగా ప్రకటించబడే నాటికి అక్బరు తన రక్షకుడైన బైరమ్ ఖాన్ వెంబడి పంజాబులో ఉన్నాడు. అయితే అతను పేరుకు మాత్రమే పాదుషా; భారత దేశానికి చక్రవర్తి నని చెప్పుకునే హక్కు అక్బరు కెంత ఉండిందో, షేర్‌షా వారసులకు కూడా అంత ఉండింది.

నిజానికి 1556 లో భారత దేశ రాజకీయ పరిస్థితి చాలా క్లిష్టంగా ఉన్నది. షేర్ షా పోయాక అతని వారసులు అంతఃకలహాలలో పడిపోయారు. షేర్ షా అమలు చేసిన సంస్కరణల సత్ఫలితాలు ప్రజలకు దక్కకుండా పోయాయి. దేశాన్ని భయంకరమైన క్షామం పట్టి పీడించసాగింది.

దేశంలోని వివిధ ప్రాంతాల గల స్వతంత్ర రాజ్యాలు ఆధిపత్యం కోసం ఘర్షణ పడుతున్నాయి. అక్బరుకు మారుతల్లి కొడుకైన మీర్జా ముహమ్మద్ హకీమ్ కాబూలును దాదాపు స్వతంత్రుడు గానే పాలిస్తున్నాడు. కాశ్మీరు, హిమాచల రాజ్యాలు స్థానిక ముస్లిము పాలకుల కింద స్వతంత్రంగా ఉన్నాయి. షేర్ షా మరణించిన నాటి నుంచి సింధు, ముల్తానుల పై చక్రవర్తి ఆధిపత్యం లేదు. అలాగే ఒరిస్సా, మాల్వా, గుజరాతుల స్థానిక పరిపాలన పైన ఎవరి పెత్తనమూ లేదు. వింధ్యకు దక్షిణాన విస్తృతమైన విజయనగర సామ్రాజ్యమూ, ఖాన్దేష్, బిరార్, బీదర్, అహ్మద్‌నగర్, గోల్కొండల సల్తనతులూ ఉన్నాయి; వాటి పాలకులకు ఉత్తర దేశ రాజకీయాలను గురించి ఆసక్తి లేదు. పశ్చిమ తీరాన గోవా, దియూలలో పోర్చుగీసువారి ప్రభావం జాస్తిగా ఉన్నది. చనిపోయే కాలానికి హుమాయూన్ తిరిగి గెల్చుకున్న పూర్వ సామ్రాజ్య భాగం చాలా కొద్దిపాటిది. ఆగ్రా నుంచి మాల్వా దాకానూ, జౌన్పుర్‌లోనూ

## 42. అక్బరు—తొలి సమస్యలు

పెత్తనం ఆదిల్‌షాది. ఢిల్లీ నుంచి కాబూలుకు పొయ్యే దారిలో కొంత భాగం షా సికందర్ చేతిలో ఉన్నది. హిమాలయాల నుంచి గుజరాతు సరిహద్దు దాకా ఉన్న భాగం ఇబ్రాహిమ్ ఖాన్ అధీనంలో ఉన్నది. షేర్ షా రాజ్యంలో అధిక భాగం సూర్ వంశీయుల అధీనం లోనే ఉన్నది.

అక్బరు రాజ్యానికి వచ్చిన కొద్ది కాలానికే, ఆదిల్ షా సూర్‌కు మంత్రీ, సేనాపతీ అయిన హీమూ అనే వాడు మొగలుల పై ఎత్తి వచ్చి, గవర్నరు తార్దీ బేగ్‌ను ఓడించి, ఆగ్రా, ఢిల్లీలను వశపరుచుకున్నాడు. ఢిల్లీని కాపాడలేక పోయినందుకు తార్దీ బేగ్‌కు బైరమ్ మరణ దండన విధించాడు.

తరవాత హీమూ, రాజా విక్రమజిత్ (విక్రమాదిత్యుడు) అన్న బిరుదు తగిలించుకుని, 1500 ఏనుగులతో కూడిన పెద్ద సేనతో సహా, సుప్రసిద్ధమైన పానిపట్టు యుద్ధ క్షేత్రంలో అక్బరు, బైరముల నెదుర్కొన్నాడు. ఆరంభంలో హీమూదే పై చెయ్యిగా ఉండింది, కాని ప్రమాద వశాన ఒక బాణం వచ్చి హీమూ కంటిలో దిగబడి, అతనికి స్పృహ తప్పిపోవటంతో అతని సైనికులు భయపడి చెల్లాచెదురై పోయారు. ఈ దశలో ఉండగా అతను



చంపబడ్డాడు. అతన్ని అక్బరు తన చేత్తోనే చంపాడని కొందరూ, అక్బరు చంప నిరాకరిస్తే, బైరం చంపాడని కొందరూ అన్నారు.

అఫ్ఘాన్, మొగలుల సంఘర్షణలో మొగలుల పక్షానిదే పై చేయి అని స్పష్టమయినది పానిపట్టు రెండవ యుద్ధంలో. ఢిల్లీ ఆగ్రాలు తిరిగి మొగలుల అధీనమయాయి. 1557 మే నెలలో సికందర్ సూర్ మొగలులకు లొంగిపోయాడు. తూర్పు పరగణాలలో అతని కొక మాన్యం ఇచ్చారు, కాని త్వరలోనే అక్బరు అతన్ని వెళ్ళగొట్టేశాడు; 1558-59 లో అతను బెంగాలులో శరణాగతుడుగా చనిపోయాడు.

ముహమ్మద్ ఆదిల్ బెంగాలు గవర్నరుతో మాంఘిర్ వద్ద యుద్ధం చేస్తూ 1556 లో చనిపోయాడు. ఇబ్రాహిమ్ సూర్ నానా దేశాలు తిరిగి, చివరకు ఒరిస్సాలో తల దాచుకున్నాడు. 1567-68 లో అక్కడే అతను హత్య చేయబడ్డాడు. అంతటితో, భారతదేశం పై అక్బరు ఆధిపత్యాన్ని సవాలు చేయగల సూర్ వంశీయు డెవడూ లేకుండా పోయాడు.

ఇన్ని విజయాలు సమకూరినా అక్బరు నామ మాత్రపు పాదుషాయే. అతని రక్షకు డైన బైరమ్ ఖాన్‌దే అసలు పెత్తనం. తాను స్వతంత్ర పాలకుడుగా ఉండాలని అక్బరు కాంక్షించటమే గాక, అతని తల్లి హమీద బాను బేగమ్, అతన్ని పెంచిన తల్లి మాహం అనగా, ఆమె కొడుకు ఆదమ్ ఖాన్ కూడా అక్బరును ప్రోత్సహించి, బైరమ్‌ను వది లించుకోమన్నారు. 1560 లో అక్బరు పరి పాలన తానే స్వయంగా చూసుకుంటానని బహిరంగా ప్రకటించి, బైరమ్ ఖాన్‌ను రక్షకుడి పదవి నుంచి తొలగించాడు. బైరమ్ అక్బరు నిర్ణయాన్ని శిరసావహించి, మక్కాకు పోతానన్నాడు. అతన్ని శీఘ్రంగా మక్కాకు పంపే పని చూడమని అక్బరు పీర్ ముహమ్మద్ అనే వాణ్ణి పురమాయించాడు. పీర్ ముహమ్మద్ ఒకప్పుడు బైరమ్ కింద పని చేసినవాడూ, బైరమ్‌కు వ్యక్తిగతంగా శత్రువూనూ. అందుచేత బైరమ్ ఈ అవమానం సహించలేక తిరుగబాటు చేసి, జల్లందర్ వద్ద ఓడిపోయాడు. అయినా అతను పూర్వం తనకు చేసిన మేలు మరవక అక్బరు అతని పట్ల ఔదార్యం ప్రదర్శించాడు.

1561 జనవరిలో బైరమ్ మక్కాకు వెళుతూండగా ఒక లోహని అఫ్ఘాను వాడు అతన్ని హత్య చేశాడు. అక్బరు అతని కొడుకైన అబ్దుర్ రహీమ్ అనే వాణ్ణి చేరదీసి పైకి తెచ్చాడు.



# నెహ్రూ కథ

## 9



పంజాబు దురంతాలు కారణంగా జవాహర్ గాంధీజీకి మరింత సన్నిహిత మయాడు. మార్షల్ లా ఉపసంహరించగానే కాంగ్రెసు విచారణ జరపటానికీ, సహాయం అందించటానికీ ఉపక్రమించింది. సహాయ కార్యక్రమం కొనసాగించటానికి స్వామి శ్రద్ధానందా, పండిత మదన మోహన మాళవీయులు నియోగించబడ్డారు; విచారణ జరిపే పని మోతీలాల్ నెహ్రూ పైనా, "దేశబంధు" చిత్తరంజన్ దాస్ పైనా పడింది. ఈ పనులను మొదటి నుంచీ శ్రద్ధగా పర్యవేక్షించిన వాడు గాంధీజీ.

జవాహర్ దాసుకు సహాయకుడుగా నియోగించబడ్డాడు. చిత్తరంజన్ దాస్ జవాహర్‌ను బలంగా ఆకర్షించాడు. ఇద్దరూ కలిసి జలియన్‌వాలా బాగ్‌ను చాలా సార్లు సందర్శించారు. ఇది పేరుకు "తోట" (బాగ్) కాని వాస్తవంగా పల్లపు ప్రదేశం. ఇక్కడ గుమి కూడిన జనం మీదనే డైయర్ కాల్పులు జరిపించాడు. జవాహర్ అనేక దారుణ ఘటనలను గురించి విన్నాడు; ఒక అంగ్ల యువతి పై చెయ్యి చేసుకున్నందుకు ప్రతిక్రియగా అనేక మంది భారతీయులను పాకించిన గొందిని కూడా అతను చూశాడు.

1919 అంతంలో జవాహర్ అమృతసర్ నుంచి ఢిల్లీకి రైలులో వస్తూ, డైయర్ మరి కొందరు బ్రిటిషు వారితో అదే పెట్టెలో ప్రయాణిస్తూ తన జలియన్‌వాలా బాగ్ ప్రతాపం గురించి ప్రగల్భాలు చెప్పటం స్వయంగా విన్నాడు.

కాంగ్రెసు జరుపుతున్న విచారణ పట్ల గాంధీజీ చాలా ఆసక్తి కనబరిచాడు. జవాహర్ ఆయనను చాలా సార్లు కలుసుకున్నాడు. గాంధీజీ వైఖరికీ తన వైఖరికీ



ఎంతో వ్యత్యాసం ఉండటం జవాహర్ గమనించాడు. విచారణ సంఘానికి గాంధీజీ చేసిన సూచనలు అతనికి వింతగా తోచాయి. అయితే గాంధీజీ తన వైఖరిని గురించి ఎంతో ఓర్పుతోనూ, పట్టుదలతోనూ చర్చించేవాడు. సాధారణంగా ఆయన పట్టే నెగ్గేది. తరుచు గాంధీజీ వైఖరే సరయినదని తరవాత ఆచరణలో రుజువవుతూండటం కూడా జవాహర్ గమనించాడు.

గాంధీజీ పైన అతని కింకా పూర్తిగా గురి కుదరకపోయినప్పటికీ, ఆయన రాజకీయ విజ్ఞత పట్లమటుకు కొద్ది కొద్దిగా ఆదరం కలగసాగింది.

గాంధీజీతో కలిసి పని చేసి, ఆయన మనస్తత్వమూ, ప్రవర్తనా అర్థం చేసుకునేటందుకు మోతీలాల్‌కు కూడా ఇదే మొదటి అవకాశ మయింది. గాంధీజీ ఆలోచనా విధానం తండ్రి కొడుకు లిద్దరికీ ఒక్కొక్కసారి అయోమయంగా కనిపించి నప్పటికీ, ఫలితాలు సాధారణంగా అనుకూలంగా ఉండేవి. గాంధీజీ ఉన్నతుడన్నది జవాహర్‌కు స్పష్టంగా తెలిసిపోయింది. ఆయనలో అతను ఒక నూతన విప్లవ శక్తిని చూశాడు. గాంధీజీ ఎప్పుడూ దేశంలోని ప్రజా హృదయం పైన లక్ష్యం ఉంచేవాడు. ఆయన ప్రజల కంకితమైన ప్రజల మనిషి.

చల్లగా రాజకీయ నాయకత్వాన్ని గాంధీజీ హస్తగతం చేసుకున్నాడు. **1919** డిసెంబరులో మోతీలాల్ అధ్యక్షతన అమృతసర్ కాంగ్రెసు సమావేశం జరిగినప్పుడు, సమావేశానికి తిలక్ హాజరైనప్పటికీ అందరి దృష్టి పడినది గాంధీజీ పైన. మొట్టమొదటి సారిగా "మహాత్మా గాంధీకి జై!" అన్న నినాదం మారుమోగింది. అది తిలక్ పాల్గొన్న ఆఖరు సమావేశం. మరుస ఏడు ఆగస్టులోనే ఆయన గతించాడు.

ఈ కాంగ్రెసు సమావేశానికి మోతీలాల్ మితవాదులను ఆహ్వానించి నప్పటికీ

వారు రాక, కలకత్తాలో ప్రత్యేక సమావేశం ఏర్పాటుచేసుకున్నారు. వారి దృష్టి నూతన సంస్కరణల మీద పడింది. వారు రాక పోవటంచేత నేమో, ఈ కాంగ్రెసు సమావేశంలో జవాహరుకు ఒక కొత్త చైతన్యం కనబడింది. ప్రజా బాహుళ్యాన్ని ఆశ్రయించుకున్న ఒక నూతన శక్తి అమృతసర్‌లో ప్రభవించింది.

అలీ సోదరులు జైలు నుంచి విడుదల అవుతూనే కాంగ్రెసులో సభ్యులుగా చేరారు. గాంధీజీ ఖిలాఫత్ ఉద్యమాన్ని చేపట్టి ముస్లిములను కాంగ్రెసుకు చాలా సన్నిహితులనుగా చేశాడు.

గాంధీజీ వెంట జవాహర్ అనేక మార్లు ఖిలాఫత్ నాయకుల సమావేశాలకు వెళ్ళాడు. గాంధీ పద్ధతులు అతనికి అర్థం కాకపోయినప్పుడు కూడా ఆకర్షవంతంగా కనబడేవి. గాంధీజీ శాసిస్తూ కూడా ఎంతో సౌమ్యం కనబరిచేవాడు. ఆయనలో పట్టుదలా, దీక్షా, స్పష్టతా ఉండేవి. ఆ కాలంలో ఆయన అహింసా, సహాయ నిరాకరణ పథకాలు రెంటితోనూ కూడిన సత్యాగ్రహ విధానాన్ని ప్రచారం చేస్తూ వచ్చాడు, ఆయన ఈ ప్రబోధాన్ని కాంగ్రెసుకూ, ఖిలాఫత్ నాయకులకూ కూడా చేశాడు.



ఖిలాఫత్ ఉద్యమం గురించి జవాహర్‌కు గాంధీజీ కున్నంత ఆసక్తి ఉండేదికాదు, ఎందుకంటే ఖిలాఫత్ ఉద్యమం హెచ్చుగా మత దృష్టితో కూడుకున్నది, ప్రధానంగా ఖలీఫా యొక్క హక్కులకు సంబంధించినది. కాని గాంధీ దృష్టిలో అది ముస్లిమ్ ప్రజానీకానికి సన్నిహితమైన ఉద్యమం. అదీ గాక దాని ద్వారా హిందూ ముస్లిం సమైక్యత సాధ్యమవుతుంది.

1920 మే 28 న ఖిలాఫత్ కమిటీ బొంబాయిలో సమావేశమై గాంధీజీ యొక్క సహాయ నిరాకరణోద్యమాన్ని ఆమోదించింది. ఆ మార్చి నెలలోనే పంజాబు

దురంతాలను గురించి కాంగ్రెసు నివేదిక విడుదల అయి, దేశ మంతటా సంచలనం కలిగించింది. అమృతసర్ దుర్ఘటనల స్మారకార్థం ఏప్రిలు 6 నుంచి 13 వరకు జాతీయ వారంగా పరిగణించాలని నిర్ణయం జరిగింది. గాంధీజీ ఒక్కొక్కప్పుడు పని పెట్టుకుని తీవ్రమైన మాటలను తేలికగా అనేవాడు; "ప్రజలు ఉరి శిక్షలను నిత్య వ్యావహారిక విషయాలుగా పరిగణించాలి" అని హెచ్చరిస్తూ, వారు తమ జీవితాలను సేవకూ, త్యాగానికీ అంకితం చేయవలిసిం దిగా పిలుపిచ్చాడు.

మే 30 న వారాణసిలో జరిగిన కాంగ్రెసు కమిటీ సమావేశం; సెప్టెంబరులో కలకత్తాలో ప్రత్యేక కాంగ్రెసు సమావేశం జరిపి గాంధీజీ సూచించిన సహాయ నిరాకరణ కార్యక్రమాన్ని గురించి ఆలోచించాలని నిర్ణయించింది. అయితే, ఈ లోపుగానే గాంధీజీ అగస్టు 1 న దేశమంతటా సహాయ నిరాకరణోద్యమం ప్రారంభం కావాలని నిర్ణయించాడు.

ఆ రోజునే బొంబాయిలో తిలక్ మరణించాడు. అవసాన దశలో ఆయన, "స్వరాజ్యం వస్తే గాని ఇండియాకు సౌభాగ్యం లేదు. మన ఉనికికి అది అత్యవసరం," అన్నాడు. ఆ రోజులలో సింధు రాష్ట్రం పర్యటిస్తూ ఉండిన గాంధీజీ జవాహర్లు దైవికంగా ఆ ఉదయమే బొంబాయినగరం చేరారు.

తిలక్ భౌతిక దేహానికి బొంబాయిలో బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. చౌపాతీలో చందన కాష్ఠాలతో తిలక్‌కు దహన క్రియలు చేశారు. గాంధీ జవాహర్లిద్దరూ ఊరేగింపులో పాల్గొన్నారు.

"నాకు మహత్తరమైన ఊత పోయింది," అన్నాడు గాంధీజీ. ఇక దేశ నాయకత్వ భారం అంతా తన పైనే పడుతుందని ఆయన ఎరుగును.






## 10

[దుర్గేశుడైన వీరేంద్రసింహుడికి నవాబు కతలూ ఖాన్ శిరశ్ఛేదం చేయించాడు. ఉస్మాన్ ఖాన్ సహాయంతో విమల ఆ సమయాన వధ్య భూమికి వెళ్ళి చావ నున్న తన భర్తకు పగ తీర్చుకుంటానని మాట ఇవ్వ గలిగింది. యువరాజు జగతసింహుడు సజీవుడై ఉన్నట్టు తెలిసి, విమల తన చరిత్ర అంతా అతనికి తెలుపుతూ ఒక ఉత్తరం రాసింది. దాన్ని ఉస్మాన్ ఖాన్ చదవసాగాడు. అది చదువుతుంటే అతనికి ఒక వింత సంగతి తెలియ వచ్చింది—అతను పసివాడై ఉండగా విమల అతన్ని దొంగబారి నుంచి కాపాడింది!]

ఉస్మాన్ తిరిగి ఉత్తరం చదవటానికి ఉపక్రమించాడు. విమల ఇంకా ఇలా రాసింది: "మర్నాడు పఠాను తన దారిన వెళ్ళిపోతూ, మా అమ్మతో, 'మీ అమ్మాయి నాకు చేసిన ఉపకారానికి ఇప్పుడేమీ ప్రత్యుపకారం చెయ్యలేను. కాని మీ కేమైనా కావలిస్తే, ఢిల్లీ వెళ్ళాక పంప గలను,' అన్నాడు. మా అమ్మ తనకు డబ్బేమీ అవసరం లేదనీ, నా తండ్రి జాడ తెలిస్తే కబురు చెయ్యమనీ అన్నది. పఠాను ఢిల్లీ వెళ్ళి ఎంతో శ్రమపడి వాకబు చేశాడు గాని, మా తండ్రి జాడ తెలియనే లేదు. పధ్నాలుగు సంవత్సరాల అనంతరం నా తండ్రి ఢిల్లీ లోనే ఉంటున్నాడనీ, అయన అభిరామస్వామి అనే పేరు పెట్టుకున్నాడనీ తెలియ వచ్చింది.

బంకించంద్ర చట్టోపాధ్యాయ




"అప్పటికి మా అమ్మ పోనే పోయింది. నా తండ్రి జాడ తెలిశాక నాకు కాశీలో ఒక్క క్షణం ఉండ బుద్ధి కాలేదు. నాకు ప్రపంచంలో మా తండ్రి తప్ప మరెవరూ లేరు. అందుచేత నేను ఒంటరిగా బయలు దేరి ఢిల్లీ వెళ్ళాను. మొదట ఆయన నన్ను చూసి చాలా అసహ్య పడ్డాడు. నేను ఏడుస్తూ నిలబడ్డాను. చివర కాయన నన్ను తన సేవలో ఉంచుకొనటానికి సమ్మతిం చాడు. మాహరూ అన్నపేరు బాగాలేదని ఆయన నా పేరు విమల అని మార్చాడు. నేను ఆయనకు తృప్తికరంగా సేవ చెయ్యటంలో చాలా ఆనందం పొందాను. నా తండ్రి నన్ను రానురాను చాలా దయగా చూడసాగాడు.

"మందారణ గ్రామంలో ఒక సైనికుడి భార్య నా తండ్రి కారణంగా గర్భవతి అయిందని ముందు చెప్పానే, ఆమెక్కూడా ఒక ఆడపిల్ల కలిగింది. ఆ తరవాత కొద్ది కాలానికే ఆమె భర్త అయిన సైనికుడు మరణించాడు. నా తల్లి లాగే ఆమె కూడా శరీర శ్రమతో పొట్టపోసుకుంటూ తన పిల్లను పోషించింది. ఆ విధవరాలి కూతురు పెరిగి పెద్దదై, అపురూప సుందరి అని పించుకుని, చివరకు తిలోత్తమకు తల్లి అయింది.

"తిలోత్తమ తల్లి గర్భంలో ఉండగానే నా పెళ్ళి గురించి మొట్టమొదటి సారిగా ప్రస్తావన వచ్చింది. వీరేంద్రసింహుడు నా తండ్రి శిష్యుడుగా మేముండే ఆశ్ర మానికి వచ్చాడు. నా తండ్రి ఆయనతో, 'నేను విమలను విడిచి ఉండలేను. నువ్వామెను పెళ్ళాడితే నేను మీ ఇద్దరి వెంటా ఉంటాను,' అన్నాడు. వీరేంద్ర సింహుడు రోషంతో, శూద్ర కన్య నెలా పెళ్ళాడ నని అడిగాడు. జార స్త్రీకి పుట్టిన దాన్ని పెళ్ళాడావు కావా అని నా తండ్రి ఎదు రడిగాడు. తాను పెళ్ళాడిన మనిషి తల్లి జార స్త్రీ అని తనకు పెళ్ళి సమయంలో

తెలియదనీ, ఏమైనా ఆమె శూద్ర స్త్రీ కాదనీ వీరేంద్రసింహుడు తనను తాను సమర్థించుకున్నాడు. ఆయన నన్ను పెళ్ళాడ నిరాకరించాడని నా తండ్రి ఆయనను ఆశ్రమానికి రావద్దనీ, వస్తే నాకు ఇబ్బందిగా ఉంటుందనీ, చూడ దలిచినప్పుడు తానే దుర్గానికి వస్తాననీ, వీరేంద్రసింహుడితో అన్నాడు. వీరేంద్రసింహుడు కొన్నాళ్ళు రావటం మానే సరికి నేను చాలా బాధపడ్డాను.

"నా సంగతి గ్రహించి నా తండ్రి, తాను సన్యాసం స్వీకరించబోతున్నాననీ, తనది ఇక ముందు సంచార జీవితంగా ఉండబోతుందనీ, మానసింహమహారాజు పెళ్ళాడిన కొత్త రాణికి నన్ను పరిచారికగా ఉంచటానికి ఏర్పాటు చేశాననీ అన్నాడు. యువరాజా, నేను మీ ప్రాంగణంలో ఒక అంతఃపురాంగన నయాను. నే నక్కడ చాలా రోజు లున్నాను గాని నీకు తెలీదు. నీవు మీ తల్లి దగ్గిర ఉండేవాడవు. నేను జోధ్పూరు రాజకుమారి ఊర్మిళాదేవి వద్ద ఉండేదాన్ని. ఆమె నన్ను ప్రాణం కంటే ఎక్కువగా చూసుకునేది. ఆమె దయ వల్ల నేను చాలా కళలు నేర్చుకున్నాను—శిల్పమూ, సంగీతమూ, నృత్యమూ. నన్నామె మహారాజు దగ్గిర కూడా ఎంతో



ఎన్నిక చేసింది. ఆ మహారాజు నా పాట విని ఎంతో ఆనందించేవారు, నన్నొక ప్రత్యేకతతో చూసేవారు. నా తండ్రి అంటే కూడా ఆయనకు చాలా భక్తి. నా కొక్కటే విచారం—నేను ప్రేమించిన మనిషికి దూరమయాను.

"నీకు అస్మానీ జ్ఞాపకం ఉండవచ్చు. మా కిద్దరికీ చాలా స్నేహం. తండ్రితో పోట్లాడి ఢిల్లీ వచ్చి ఉంటున్న వీరేంద్రసింహుడి వద్దకు అస్మానీని పంపాను. ఆమె ఆయనను కలుసుకుని నా సమాచారం చెప్పింది. మా ఇద్దరి మధ్యా ఉత్తరప్రత్యుత్తరాలు సాగాయి. మా మధ్య ప్రేమ



పెరుగుతూ వచ్చింది. అలా మూడేళ్ళు గడిచాయి.

"అంతలో వీరేంద్రసింహుడు ఒక ఉపద్రవమైన పని చేశాడు. ఆయన నీళ్ళు మోసేవాడి లాగా నటిస్తూ అస్మానీ వెంట అతఃపురంలోకి వచ్చి, నేను ఒంటరిగా నిద్రపోయే చోట దాక్కున్నాడు. ఒక రాత్రి వేళ మానసింహమహారాజుగారే మేమున్న చోటికి వచ్చారు. వీరేద్రసింహుణ్ణి పట్టుకు పోయి ఖైదులో పెట్టారు. ఆయనకు శిక్ష పడుతుంది. నాకు వెర్రెత్తిపోయింది. వెళ్ళి ఊర్మిళాదేవి కాళ్ళు పట్టుకున్నాను, నా తండ్రి పాదాల పైన పడి ఏడ్చాను. ఆయన నా దుఃఖం చూసి జాలి పడకపోగా, 'పాపిష్టిదానా, సిగ్గు పూర్తిగా వదిలేశావా?' అని తిట్టాడు.

"ఊర్మిళాదేవి నా తరఫున మహారాజును బతిమాలింది. 'అతను విమలను పెళ్ళాడే పక్షంలో క్షమించి విడిచిపెడతాను,' అన్నారు మహారాజు. ఈ మాట విని వీరేంద్రసింహుడికి కోపం వచ్చింది. 'నేను ఖైదులోనే ఉండి, మరణ దండన అయినా పొందుతాను గాని శూద్ర స్త్రీని పెళ్ళాడను. హిందువులై ఉండి కూడా నన్నిలా తగని పని చెయ్యమని ఎందు కడుగుతారు?' అన్నాడాయన. 'నా చెల్లెలిని యువరాజు సలీమ్ కిచ్చి పెళ్ళిచేశాను. బ్రాహ్మణుడికి పుట్టిన పిల్లను పెళ్ళాడటానికి నీ కేమిటి అభ్యంతరం? నువు పెళ్ళాడకపోతే ఆమె నిప్పుడు మరెవరు పెళ్ళాడతారు?' అన్నాడు మహారాజు.

"అప్పటికీ వీరేంద్రసింహుడు ఒప్పుకోలేదు. ఖైదులో ఆయనను నీచంగా చూస్తూండటం చేత చివరకు అర్థాంగీకారంగా, 'ఈమెను పెళ్ళాడతాను గాని, ఆమె నా భార్య నని చెప్పుకోకూడదు, నా భార్య లాగా వ్యవహరించ కూడదు, నా ఇంటి దాసీ లాగా మసలుకోవాలి,' అన్నాడాయన.

నే నందుకు సంతోషంగా ఒప్పుకున్నాను. మాకు వివాహ మయింది. నేను దాసీ లాగా నా భర్త ఇంటికి వచ్చాను.

"మాది బలవంతంగా జరిగిన పెళ్ళి. అదివరకు నా భర్తకు నేనంటే ఎంతో ప్రేమా, దయా ఉండేవి. పెళ్ళయాక నే నాయనకు విష మయాను. నా మీద ఉండిన కోపం కొంత కాలానికి పోయింది గాని, ఆయనకు మానసింహమహారాజు పైన కలిగిన కోపం అలాగే ఉండిపోయింది. అది విధి నిర్ణయం. నన్ను గురించి చెప్పేది అయిపోయింది. ఇందులో తిలోత్తమ విషయం ఏమీ రాయలేదు. నీ వామెను మరిచిపో."

ఉస్మాన్ ఖాన్ ఉత్తరం చదవటం పూర్తి చేసి, దీర్ఘంగా నిట్టూర్చి, "అమ్మా నీవు నన్ను కాపాడావు. అందుకు ప్రత్యుపకారం తప్పక చేస్తాను," అన్నాడు.

"ఉస్మాన్, ఈ మోడులో ఆశ రేకెత్తించి మోసగించ చూస్తున్నావా?" అన్నది విమల. ఆమె కళ్ళు మెరిశాయి.

ఉస్మాన్ తన చేతిలోంచి ఉంగరాన్ని తీసి ఆమె కిస్తూ, "దీన్ని నీ వద్ద ఉంచు. అంత త్వరలో ఏమీ సాధ్యం కాదు. కాని త్వరలోనే కతలూ ఖాన్ జన్మదినం రాబో



తున్నది. ఆ రోజు బ్రహ్మాండమైన ఉత్సవం జరుగుతుంది. రాజమహల్‌లో అందరూ ఆనంద పారవశ్యంలో మునిగి తేలుతూం టారు. కాపలా వాళ్ళు తెగ తాగి బాగా రాత్రి పడ్డాక ఒళ్ళు తెలియని స్థితిలో ఉంటారు. ఆ రోజున నీకు విముక్తి కలిగిస్తాను. ఆ నాడు అర్ధరాత్రి సమయానికి అంతఃపుర ద్వారం వద్దకు రా. అక్కడ ఎవడైనా నీకు ఇలాటి ఉంగరమే చూపించినట్టయితే, వాడి వెంట క్షేమంగా బయిటికి వెళ్ళిపోవచ్చు," అన్నాడు.

విమల అతన్ని అనేక రకాల దీవించి వెళ్ళిపోబోయింది. ఉస్మాన్ ఆమెను ఆపి,



"కాని నీవు ఒంటరిగా మాత్రమే రావాలి. లేకపోతే పని పాడుగావటమే గాక లేనిపోని చిక్కులు కూడా కలగవచ్చు," అన్నాడు.

తిలోత్తమను తన వెంట తీసుకురా గూడదని ఉస్మాన్ అభిప్రాయ మైనట్టు విమల గ్రహించి, "ఒక్కరే తప్పించుకు పోయే అవకాశం ఉంటే, తిలోత్తమే తప్పించుకు పోతుంది. నా దేమున్నది? నే నెలాగైనా తప్పించుకు పోగలను," అనుకున్నది.

ఆమె ఉస్మాన్‌ను మళ్ళీ దీవించి, తా నుండే చోటికి తిరిగి వెళ్ళిపోయింది.

రోజులు గడుస్తున్నాయి. క్రమంగా జగతసింహుడు కోలుకుంటున్నాడు. బలం కూడా పట్టుతున్నది. కాని ఆరోగ్యం చేకూరుతున్నకొద్దీ అతని మనస్సు తిలోత్తమను గురించిన విచారంతో బాధపడటం జాస్తి అయింది. అతను కనబడిన వారి నందరినీ అడిగి చూశాడు, కాని ఒక్కరైనా తిలోత్తమను గురించిన ఒక్క శుభవార్త అతని చెవిన వేశారుకారు. ఆమె ఎక్కడ ఉన్నదీ ఆయుషాకు కూడా తెలీదు. ఉస్మాన్ తెలిసి కూడా చెప్పడు. "ఆమె ఎక్కడ? ఆమె ఎక్కడ?" అన్న ప్రశ్న అహోరాత్రాలు యువరాజు మెదడులో ఒకే తీరున ప్రతిధ్వనిస్తున్నది. అందుచేత అతనికి సుఖమయంగా ఉండవలసిన శయ్య అంపశయ్యలాగా అయింది.

ఇది గాక జగతసింహుడికి మరొక చింత కూడా ఉంది: "ముందు ఏం జరుగనున్నది?" ఆ ప్రశ్నకు కూడా సమాధానం చెప్పేవారు లేరు. తాను ఖైదీ అన్న సంగతి అతనికి తెలుసు. అతను కారాగృహంలో కాకుండా సుఖంగా హంసతూలికా తల్పం పైన ఉన్నాడంటే అందుకు ఉస్మాన్, ఆయుషాల అనుగ్రహమే కారణం. దాస దాసీలు అతనికి నిరంతమూ పరిచర్యలు చేస్తున్నారు. ఆయుషా తోడ బుట్టువు కన్న ఎక్కువగా అతన్ని కనిపెట్టుకుని



ఉంటున్నది. కాని ద్వారం వద్ద కాపలా వాడు ఉండనే ఉన్నాడు.

జగతసింహుడికి పరిచర్యలు అవసర మైన సమయంలో ఆయుషా అహెూ రాత్రాలు దగ్గిరే ఉండి సేవ చేసింది. అత నికి ఆరోగ్యం హెచ్చినకొద్దీ ఆమె రాక పోకలు మందగించాయి. అతనికి పూర్తి స్వాస్థ్యం చేకూరాక ఆమె రావటం దాదాపు మానేసింది; ఎప్పుడైనా వస్తే వచ్చేది, లేకపోతే లేదు.

ఒకనాడు జగతసింహుడు గవాక్షం వద్ద నిలబడి బయటికి చూస్తూ ఉండగా వెనుక నుంచి ఉస్మాన్ వచ్చి, "ఏమిటి చూస్తున్నావు?" అని అడిగాడు.

"వీధిలో ఎవరో మనిషి చుట్టూ జనం మూగి వినోదం పొందుతున్నారు," అన్నాడు జగతసింహుడు.

"ఆ బ్రాహ్మడు మందారణ దుర్గం మనిషే," అన్నాడు ఉస్మాన్.

మందారణ దుర్గం మనిషి అని వినగానే, అతని ద్వారా తిలోత్తమ సమాచారం తెలుస్తుందేమో నని ఆశపడుతూ జగత సింహుడు, "అతని పేరేమిటో?" అన్నాడు.

"గణపతా? గజపతా? అలాటి పేరే ఏదో ఉంది," అన్నాడు ఉస్మాన్.



"బెంగాలీ వాడిలా గున్నాడు. దారే పొయ్యే వాళ్ళకు వినోదం కలిగించటం చూస్తే ఆశ్చర్యం వేస్తున్నది."

దిగ్గజుణ్ణి గురించి ఉస్మాన్ లోగడ విని ఉన్న దాన్ని బట్టి అతను ప్రమాదకరమైన మనిషి అనిపించలేదు. అందుచేత అతను జగతసింహుడితో, "కావలిస్తే ఆ బ్రాహ్మణ్ణి పిలిపించవచ్చునే!" అన్నాడు.

మనిషి వెళ్ళి దిగ్గజుణ్ణి పిలుచుకు వచ్చాడు. ఉస్మాన్ అతన్ని, "మీరు బ్రాహ్మణులేనా?" అని అడిగాడు.

దిగ్గజుడు చేతు లాడిస్తూ, "అసారే ఖలు సంసారే సారం శ్వశుర మందిరం,"



అని చదివాడు. అంటే అత్తవా రిల్లంత సుఖమైన చోటు ప్రపంచంలో లేదని అర్థం.

జగతసింహుడు నవ్వు ఆపుకుంటూ దిగ్గజుడికి వందనం చేశాడు. దిగ్గజు డతన్ని, "ఖుదా ఖాన్ బాబుగారిని సుఖంగా చూచు గాక!" అని ఆశీర్వదించాడు.

"పండిజ్జీ, నేను ముసల్మానును కాను, హిందువుణ్ణి," అన్నాడు యువరాజు.

ఆ యువకుడు అబద్ధం చెప్పి తనను మోసగించ జూస్తున్నా డనుకుని దిగ్గజుడు, "ఖాన్ బాబూ, నేను తమ పాద దాసుణ్ణి. నన్ను అవమానించకండి," అన్నాడు.

"మీది మందారణ. మీ పేరు దిగ్గజుడు. మందారణ సమాచారా లేవైనా చెబు తారా?" అన్నాడు జగతసింహుడు.

"అభిరామస్వామి పారిపోయాడుగా!" అన్నాడు దిగ్గజుడు.

"వీరేంద్రసింహుడి సంగతి?" అని జగతసింహు డడిగాడు.

"నవాబాయనను చంపేశారు," అన్నాడు దిగ్గజుడు.

జగతసింహుడు ఉస్మాన్ కేసి తిరిగి, "ఏమిటి ఈ బ్రాహ్మణు డిలా పచ్చి అబద్ధా లాడుతున్నాడు?" అన్నాడు.

నవాబు వీరేంద్రసింహుణ్ణి నిండు సభలో రాజద్రోహిగా విచారణ జరిపి శిక్ష విధించి నట్టూ, ఆయన తన సలహా కూడా పాటించ నట్టూ ఉస్మాన్ తెలిపి, దిగ్గజుడితో, "ఇక నీవు వెళ్ళవచ్చు," అన్నాడు.

యువరా జతన్ని ఆపి విమల ఏమయిం దని అడిగాడు. నవాబుకు విమల ఉంపుడు గత్తె అయిందని దిగ్గజుడు చెప్పాడు. యువ రాజు ఆపుకోలేక తిలోత్తమ సంగతి అడిగితే, ఆమె కూడా ఉంపుడుగత్తె అయి పోయిందని దిగ్గజుడు చెప్పాడు.

జగతసింహుడు ఉస్మాన్ కేసి తిరిగి, "మీరు సేవ చేస్తున్నది నవాబుకు కాదు, పిశాచానికి!" అన్నాడు.—(ఇంకా వుంది)






# ఫలించని యత్నం

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, మానవులు దూరాలోచన లేకపోవటం చేత నిష్కారణంగా తాము యాతన పడి ఇతరులను యాతన పెడతారు. పూర్వం శతకేతుడి ప్రయాస లాగే నీది కూడా వ్యర్థ ప్రయాస అయిపోతుందేమో ఆలోచించావా? శ్రమ తెలియకుండా నీకు శతకేతుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

ఒకప్పుడు శూరమాగధ దేశపు రాజుకు శతకేతుడూ, వీరకేతుడూ అని ఇద్దరు కొడుకు లుండేవారు. పెద్దరాజు పోయాక శతకేతడు రాజయాడు. నిజానికి వీరకేతుడికి రాజ్యార్హత లేదు. కాని అతను చాలా పౌరుషవంతుడు; ఒక రాజుకు తల వంచే

## బేతాళ కథలు



వాడు కాదు. అందుచేత వీరకేతుడు, తన అన్న రాజ్యాభిషేకం చేసుకోగానే కొద్దిమంది అనుచరులతో శూరమాగధదేశాన్ని విడిచి పెట్టి వెళ్ళిపోయి, అశ్వకర్ణ మనే చిన్న దేశంలో రాజ్యం నెలకొల్పాడు.

వీరకేతుడి అనుచర వర్గంలో ప్రముఖు లని చెప్ప దగినవారు ఆరుగురున్నారు. వారిలో గోవర్ధనాచార్యు డనే వాడొక డుండే వాడు. ఆయన వీరకేతుడికి యుద్ధ విద్య లన్నీ నేర్పిన గురువు. వీరకేతుడూ, అతని ఆరుగురు అనుచరులూ కలిసి అశ్వకర్ణంలో ఆదర్శప్రాయమైన రాజ్యాగం ఏర్పాటు చేశారు. రాజ్యం చిన్నదే అయినా వీరకేతుడు ప్రజారంజకంగా పరిపాలిస్తూ, దేశాన్ని సుభిక్షమూ, శక్తివంతమూ చేశాడు.

వీరకేతుడికి విజయకేతు డనే కొడు కుండేవాడు. ఆ కుర్రవాడు పసితనం నుంచీ వయసుకు మించిన శౌర్య సాహసాలు ప్రదర్శించుతూ వచ్చాడు. అందుచేత వీర కేతుడు వాణ్ణి గోవర్ధనాచార్యుడి కింద ఉంచి యుద్ధ విద్యలు నేర్పించాడు. విజయకేతు డా విద్యలలో అసాధారణ కౌశలం కన బరిచి, పధ్నాలు గేళ్ళ వయసులోనే ఆరి తేరిన యోధులను ఎదుర్కొ గల అస్త్ర లాఘవం అలవరుచుకుని అందరికీ అద్భుతం కలిగించాడు.

విజయకేతుడికి పద్దెనిమిదేళ్ళ వయసు ఉన్న సమయంలో ఇద్దరు రాక్షసులు అశ్వ కర్ణ దేశపు శివార్ల పైన పడి, పంటలు పాడు చేస్తూ, పశువులను ఎత్తుకుపోతూ, అడ్డం వచ్చిన వారిని చంపుతూ, ఇళ్ళూ తోటలూ పాడుచేస్తూ పీడాకరంగా ప్రవర్తిస్తున్నారని వార్త వచ్చింది. రాజైన వీరకేతుడు వెంటనే కొంతమంది సైనికులను వెంటబెట్టుకుని రాక్షసులను చంపటానికి బయలుదేరాడు. కాని ఆయన ఎంత మేర తిరిగినా ఆయనకు రాక్షసులు కంట పడలేదు. వాళ్ళు ఎక్కడో కొండలలో దాక్కున్నారు. చేసేది లేక వీర

కేతుడు తన నగరానికి తిరిగి వచ్చాడు. వెంటనే రాక్షసులు రాజ్యంలో మళ్ళీ అగడాలు సాగించారు.

విజయకేతుడి కొక ఆలోచన వచ్చింది. అతను తన గురువుతో, "ఎవరూ వెంట లేకుండా మీరూ నేనూ మాత్రమే బయలుదేరి వెళ్ళి వెతికితే ఈ రాక్షసుల జాడ చిక్కకపోదు. వాళ్ళిద్దరినీ మన మిద్దరమూ చంపలేమా ?" అన్నాడు.

తన శిష్యు డన్న ఈ మాటకు గోవర్ధనుడు చాలా సంతోషించాడు. అయన ఇప్పుడు వృద్ధుడైనప్పటికీ అయన ప్రతాపం ఎప్పటిలాగే ఉన్నది.

వాళ్ళిద్దరూ చెరొక కత్తీ నడుముకు తగిలించుకుని, చెరొక బల్లెమూ పట్టుకుని రాక్షసులను వెతుక్కుంటూ బయలుదేరారు. ఎంత తిరిగినా వారికి రాక్షసుల జాడ అంతు చిక్కలేదు. వారు తమ రాజ్యానికి దక్షిణాన ఉన్న కొండల కేసి వెళ్ళారు. రాజ్యానికీ కొండలకీ మధ్య ఉండే ప్రాంతంలో చిట్టడవులూ, అందులో ఆటవికుల గ్రామాలూ ఉన్నాయి. అక్కడ ఉండే ఆటవికులు రాక్షసులకు సహాయం చేసే వారు కారనీ, ఎవరైనా రాక్షసులను చంపితే వాళ్ళు సంతోషిస్తారనీ గోవర్ధనుడు తెలుసుకున్నాడు.



ఆటవికులు వాళ్ళకు మరొక ఉపకారం కూడా చేశారు; విజయకేతుడూ, గోవర్ధనుడూ ధరించిన కత్తులు పరీక్షించి, "ఈ అవిటి కత్తులతో మీరు రాక్షసులను చంపగలరా? రాళ్ళను సైతం చీల్చగల ఉక్కు కత్తులను మేము తయారు చేసి ఇస్తాం. వాటితో రాక్షసుల పీడ వదిలించెయ్యండి," అన్నారు.

వాళ్ళు తయారుచేసిన కత్తులను ధరించి గురు శిష్యులు కొండల కేసి బయలుదేరారు. ఒక చోట వారికి రాక్షసి అడుగుజాడలు కనిపించాయి. వాటి వెంబడి వారు కొంత దూరం పోయేసరికి దూరంగా ఒక పెద్ద

గుహ కనిపించింది. అందులోనే రాక్షసులు దాగి ఉంటారనుకుని వారు గుహ కేసి పోతూండగా, అందులో నుంచి ఒక రాక్షసుడు పెద్ద రాతి గద తీసుకుని పరిగెత్తుకుంటూ వాళ్ళ మీదికి వచ్చి, తన గదతో గోవర్ధనుడి తల పగలగొట్ట యత్నించాడు. గోవర్ధనుడు ఎంతో చాక చక్యంతో గదను తప్పించుకుంటూ వచ్చాడు. అదే సమయమనుకుని విజయకేతుడా రాక్షసుణ్ణి తన కత్తితో డొక్కలో పొడవ బోతూండగా గుహలో నుంచి ఒక ఆడ రాక్షసి పరుగున వచ్చి, వెనక పాటున అతన్ని తీసుకుని గుహలోకి పారిపోసాగింది.

గోవర్ధను డది గమనించి, రాక్షసుడు తనను కొట్టబోయి నేల కేసి కొట్టిన గద మీద ఒక కాలు పెట్టి పైకి లేచి, తన కత్తితో రాక్షసుడి తల పగలేసి, పరిగెత్తుకుంటూ వెళ్ళి, అదే కత్తితో ఆడ రాక్షసి వెన్నులో పొడిచేశాడు.

ఈ విధంగా ఇద్దరు రాక్షసులూ ఒకే క్షణంలో చచ్చారు. గురు శిష్యు లిద్దరూ నగరానికి తిరిగి రాగానే ప్రజలు వారి సమర్థతనూ, ప్రత్యేకంగా గోవర్ధనాచార్యుడి పరాక్రమాన్నీ ఎంతగానో పొగడారు.

ఇది జరిగిన కొద్ది కాలానికే వీరకేతుడు మరణించాడు. విజయకేతుడు రాజయాడు.



తన తండ్రి కోసం రాజ్యాన్ని ప్రతిష్ఠించిన వా రందరి సహకారమూ పొందుతూ విజయ కేతుడు తన చిన్న రాజ్యాన్ని వివేకంగా పాలిస్తూ, నూరామడల మేరగల దేశాలకు ఆదర్శంగా ఉండేటట్టు చేసుకున్నాడు.

తన తమ్ముడి కొడుకు తన కన్న గొప్ప ప్రతిష్ఠ సంపాదించటం చూసి శూరమాగధ ప్రభువైన శతకేతుడు అసూయతో కుమిలి పోయాడు. ఆయన పంపగా ఒక దూత వచ్చి విజయకేతుడితో, "మీరు మాకు సామంతులై యుండి కూడా కప్పం చెల్లించ కుండా వున్నారు. త్వరలో మీరు మాకు కప్పం చెల్లించనట్టయితే మీ పైన తీవ్రమైన చర్య తీసుకోవలసి వస్తుందని శతకేత మహారాజు గారు మిమ్ములను హెచ్చరించమన్నారు," అని చెప్పాడు.

"మేము స్వతంత్రుల మనీ, ఎవరికీ సామంతులం కామనీ, ఆయనకు కప్పం కావలసి ఉంటే మా పెత్తండ్రిగారు స్వయంగా వచ్చి తీసుకోవలసి ఉంటుందనీ చెప్పు," అని విజయకేతుడు దూతను పంపేశాడు.

అతని సమాధానానికి అతని మంత్రు లందరూ హర్షించారు గాని, శతకేతుడి అపార సైన్యాలతో పోరాటం సామాన్యమైన సంగతి కాదని వారికి తెలుసును. అందుచేత





శతకేతుడి సైన్యాలను నిరోధించటాని కొక యుక్తి పన్నారు. శతకేతుడు తన సైన్యంతో యుద్ధానికి బయలుదేరి వస్తూ, ఒక రాత్రి శిబిరాలలో మజిలీ చేసి ఉన్న సమయంలో, సాహసికు లైన విజయకేతుడి యోధులు ఒక వంద మంది అర్ధరాత్రి వేళ ఆ శిబిరం పై బడి, సేనను చెల్లాచెదరు చేసి, యుద్ధ ప్రయత్నాలకు విఘ్నం కలిగించారు.

శిబిరాన్ని వారు కొల్ల గొట్టినప్పుడు చాలా ధనం దొరికింది. విజయకేతుడు దాన్ని తన సైనిక శిబిరానికి చేర్పించి, అక్కడి నుంచి తన రాజధానికి తనకు ఆప్తు లైన అయిదు గురు యోధుల వెంట పంపించాడు.

అయితే శతకేతుడి సైనికులు దారిలో మాటు వేసి, హఠాత్తుగా వారి పైబడి ఆ అయిదుగురు యోధులనూ, ధనాన్నీ కూడా పట్టుకున్నారు.

దానితో విజయకేతుడి ఆట కట్టయి పోయింది. ఎందుకంటే ఇక అతను తన పెత్తండ్రిని యుక్తితో జయించే ఆశ లేదు. యుద్ధ తంత్రం నడపగల వీరులు అయిదు గురు ముందుగానే శత్రువుకు చిక్కి పోయారు. వారిలో అతని గురువైన గోవర్ధనుడు కూడా ఉన్నాడు. ప్రత్యక్ష యుద్ధంలో విజయకేతుడు గెలవటం అసంభవం. తాను పౌరుషం కొద్దీ యుద్ధం చేసి వీర మరణం పొందటానికి విజయకేతుడు సిద్ధంగానే ఉన్నాడు, కాని మహా వీరులైన తన యోధులు తన పెత్తండ్రి చేత మరణ శిక్ష పొందటం నిశ్చయం. అంతకన్న తాను అవమానం పొంది అడవులు పట్టి పోవటమే ఎంతో మేలు.

ఇలా ఆలోచించి విజయకేతుడు ఒక దూతను తన పెత్తండ్రి వద్దకు సంధి రాయబారం పంపాడు. అతని దూత వెళ్ళి శతకేతుడితో, "మహారాజా, మీరు పట్టుకున్న అయిదుగురు యోధులనూ విడిచిపుచ్చి నట్టయితే అశ్వకర్ణ రాజ్యాన్ని మీ పరం

చెయ్యటానికి మా రాజుగారు సిద్ధంగా ఉన్నారు," అని చెప్పాడు.

ఇలా సంధి చేసుకోవటానికి శతకేతుడు సమ్మతించాడు.

విజయకేతుడు బంధవిముక్తులైన తన అనుచరులను తిరిగి కలుసుకున్నాడు. వారు కూడా అతని వెంట అరణ్యవాసం చెయ్యటానికి సిద్ధమయారు.

ఇది జరిగిన ఏడాది లోపల శతకేతువు మరణించాడు. ఆయనకు సంతానం లేని కారణం చేత శూరమాగధ సింహాసనమూ, అశ్వకర్ణ సింహాసనమూ విజయకేతుకే సంక్రమించాయి.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా తనకు విజయకేతువు తప్ప మరొక వారసుడు లేడని తెలిసికూడా శతకేతువు అతనిపై ఎందుకు కత్తి కట్టాడు? కప్పం కట్టమని రాయబారం పంపటమూ, దండెత్తి రావడమూ మొదలైన వన్నీ వ్యర్థ ప్రయత్నాలే గదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజరికం అన్నది జీవితాంతం దాకా అవిఘ్నంగా అనుభవించ దగినది, పెంపొందించుకో వలిసినది. రాజ్యకాంక్ష బంధుత్వాన్ని లక్ష్య పెట్టదు. తన అనంతరం ఎవరు రాజవుతారన్న ఆలోచన ఏ రాజునూ బాధించదు. తన రాజరికానికి కన్న కొడుకే విఘ్నం తలపెట్టినా రాజు అయినవాడు సహించడు. ఆ కారణం చేతనే విజయకేతుడు కూడా తన పెత్తండ్రి జీవితాంతంవరకూ ఆయనకు సామంతుడుగా ఉండలేక, తన కన్న బలవంతుడైన వాణ్ణి కయ్యానికి ప్రేరేపించాడు, ఆయనపై దొంగ దెబ్బ కూడా తీశాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌన భంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# విపరీతపురాణం

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలనే పేరుతో ఎనిమిది మంది గొప్ప కవులుండేవారు. వారిలో తెనాలి రామలింగ కవి ఒకడు. అతను మిగిలిన వారి లాగా గొప్ప కవీ, విద్యావంతుడూ మాత్రమే గాక సాహసీ, యుక్తిపరుడూనూ.

ఒకసారి రాయలవారు రామలింగ కవిని ఒక రాచకార్యం పైన ఢిల్లీ పాదుషా వద్దకు అధికార పత్ర మిచ్చి పంపాడు. సుభద్రు డనే మిత్రుణ్ణి వెంట బెట్టుకుని రామలింగడు విజయనగరం నుంచి ఢిల్లీకి ప్రయాణమై రాత్రిళ్ళు ఏదో ఒక గ్రామంలో మజిలీ చేస్తూ వచ్చాడు.

ఒకనాటి సాయంకాలం అతను భర్గదుర్గమనే గ్రామం చేరి ఆ రాత్రి ఆ గ్రామంలో ఒక బ్రాహ్మడి ఇంట బస చేసి, సంభాషణ వశాన ఆ ఊరి జమీందారు గురించి కొన్ని వింత విషయాలు విన్నాడు.

ఆ జమీందారు పేరు దుష్టవర్మ. అతనికి రెండు మూడు గ్రామాలు మాత్రమే ఉన్నాయి. అయితే అతని పూర్వులు ఖ్యాతి గల వాళ్ళు. వాళ్ళు ఎందరో బ్రాహ్మణులకు భూదానాలు చేశారు. చెట్టుకు పిదప కాలంలో పుట్టిన కుక్కమూతి పింద లాగా ఈ దుష్టవర్మ తయారయాడు. అతను రోజూ ఊళ్ళో ఉండే బ్రాహ్మణులను పిలిచి పురాణం చెప్పమంటాడు. ఎవరైనా పురాణం చదివి అర్థం చెబుతుంటే, "అందరికీ తెలిసే అర్థమే చెబుతున్నావు. అందులో ఉండే విశేషార్థమూ, గూఢార్థమూ చెప్పు," అంటాడు. చెప్పలేకపోతే, "నీకు బుద్ధి కొంచం కూడా లేదు," అంటాడు. అతని బాధ పడలేక ఎవరైనా పురాణం చెప్పటానికి రానంటే వాళ్ళను పొలాలు చేసుకోనివ్వకా, సరిగా బతకనివ్వకా, నానా తిప్పలూ పెడతాడు.

వి. పాండురంగారావు



దుష్టవర్మ వ్యవహార మంతా విన్న మీదట రామలింగడికి అతని అంతు తేల్చా లనిపించింది. అతను తన మిత్రుడైన సుభద్రుడితో ఆలోచించి, మర్నాడు పొద్దున ప్రయాణం కొనసాగించే ప్రయత్నం విరమించి, దుష్ట వర్మ ఇంటికి వెళ్ళాడు.

రామలింగణ్ణి చూసి దుష్టవర్మ, "ఎవరు మీరు?" అని అడిగాడు.

"మేం అద్భుత పౌరాణికులం. మాది కాశీ," అన్నాడు రామలింగడు.

"మా సంగతి తెలిస్తే అద్భుత పౌరాణి కుల మని అంత దర్పంగా చెప్పుకోవు!" అన్నాడు దుష్టవర్మ.

"మీ సంగతి తెలియకపోవట మేమిటి? మిమ్మల్ని గురించి కాశీలో సైతం గొప్పగా చెప్పుకుంటున్నారు. అందుకని పురాణం చెప్పటంలో మా సత్తా మీకు చూపింతా మని బయలుదేరి యిక్కడికి వచ్చాం," అన్నాడు రామలింగడు.

"దాన్ని గురించి వివరంగా చెప్పు," అన్నాడు దుష్టవర్మ.

"మేం నూటపది రకాలుగా పురాణం చెప్పగలం. ఏ నాడో జరిగిన సంఘటనలు కళ్ళకి కట్టినట్టు చూపగలం. భారతంలో రామాయణార్థం, రామాయణంలో భార తార్థం, భాగవతంలో భారత రామాయణాల అర్థం, ఈ అన్నిటి లోనూ బ్రాహ్మణార్థం చూపించగలం. మా ప్రజ్ఞ చెబితే అర్థమయేది కాదు," అన్నాడు రామలింగడు.

అతని చేత ఆ రాత్రే పురాణం చెప్పించ టానికి దుష్టవర్మ ఏర్పాటు చేయించాడు. రామలింగడు బసకు తిరిగి వచ్చి తన చుట్టూ మూగిన బ్రాహ్మణులకు చెప్ప వలసిన దంతా చెప్పి, ఆ రాత్రి సుభద్రుణ్ణి వెంటబెట్టుకుని, బ్రాహ్మ లందరూ చేతి కర్రలు తీసుకుని వెనక రాగా, దుష్టవర్మ ఇంటికి వెళ్ళాడు. అక్కడ దుష్టవర్మా, గ్రామం లోని బ్రాహ్మణులూ చాపల మీద

కూర్చున్నారు. ప్రత్యేకంగా వేసిన ఆసనాల పైన రామలింగడూ, సుభద్రుడూ కూర్చున్నారు.

భారతం లోని యుద్ధ ఘట్టాలను పురాణం చెప్పమని దుష్టవర్మ కోరాడు. సుభద్రుడు యుద్ధ ఘట్టంలో ఒక పద్యం చదివాడు. సంస్కృతంలో ఒక మాటకు అనేకమైన అర్థా లుంటాయి. ఆ వంక పెట్టి రామలింగడు, రావణుడు పాండవులను యుద్ధ సహాయం అడిగాడనీ, కర్ణుడు రావణుణ్ణి కొట్టాడనీ అర్థం చెప్పాడు. వాయుసుతుడు సుశర్మను కొట్టాడని ఉంటే ఆంజనేయుడు సుశర్మను కొట్టాడని చెప్పాడు. గురుడు ప్రాయోపవేశం చేసి వున్నప్పుడు దృష్టద్యుమ్నుడు ఆయన జుట్టు పట్టుకుని నరికాడని ఉంటే, బృహస్పతి వెంట్రుకలను దృష్టద్యుమ్నుడు కత్తిరించాడని రామలింగడు అర్థం చెప్పాడు. హరి అన్న మాటకు కోతి అని అర్థం కూడా ఉన్నది గనక, హరి కంసుడి పైకి లంఘించాడని ఉంటే, సుగ్రీవుడు కంసుడి పైకి ఎగిరి చంపబోయాడని చెప్పాడు.

దుష్టవర్మ నిర్ఘాంతపోయి, "ఇదేం పురాణం చెప్పటం? అంతా కలగా పులగంగా ఉంది!" అన్నాడు.



"అవును. ఇదే భారతంలో రామాయణార్థం, రామాయణార్థంలో భారతార్థంలో భాగవతార్థం," అన్నాడు రామలింగడు.

"పురాణ కథలు కళ్ళకు కట్టినట్టు చేస్తా మన్నావే. అది కూడా ఎలావుంటుందో అనుభవించి పురాణం చాలిస్తాం," అన్నాడు దుష్టవర్మ.

"చిత్తం," అంటూ రామలింగడు లేచి, "కర్ణుడు రావణుణ్ణి ఇలా తన్నాడు," అంటూ దుష్టవర్మను కుర్చీలో నుంచి ఒక్క తన్ను తన్ని, "దృష్టద్యుమ్నుడు బృహస్పతి జుట్టు ఇలా కోశాడు," అంటూ కత్తి తీసుకుని దుష్టవర్మ జుట్టు కోసేసి,

"హనుమంతుడు సుశర్మ ఇల్లు ఇలా తగల బెట్టాడు," అంటూ దుష్టవర్మ ఇంటి చూరు దీపంతో అంటించాడు.

దుష్టవర్మ కోపోద్రేకంతో రామలింగణ్ణి కొట్టబోయాడు, కాని బ్రాహ్మణు లందరూ చేతి కర్రలతో రామలింగణ్ణి కాచారు. దుష్ట వర్మ గ్రామంలో వారి నందరినీ పిలిపించి, రామలింగడు చేసిన అఘాయిత్యాలు వారికి తెలిపి, అతన్ని విచారించి కఠినంగా శిక్షించ మన్నాడు.

"ఎందు కిలా చేశావు ?" అని గ్రామ ముఖ్యులు రామలింగణ్ణి అడిగారు.

"ఆయన కోర కుండా నే నేమీ చెయ్య లేదు. కావలిస్తే ఇక్కడ వున్న బ్రాహ్మల నందరినీ జరిగిన దేమిటో అడగండి," అన్నాడు రామలింగడు.

"దుర్మార్గుడా, అద్భుతమైన పురాణం చెబుతానని అవాకులూ చెవాకులూ అర్థాలు చెబుతావా? పురాణ సంఘటనలు కంటికి కనబడేలాగు చేస్తానని నా జుట్టు కోసి, నన్ను తన్ని, నా ఇంటికి చిచ్చుపెడతావా?" అన్నాడు దుష్టవర్మ.

"నేను పురాణాలలో ఉన్నది తప్పుగా చేప్పా నని ఎవడన్నా అంటే వాడి తల తీసేస్తాను. నన్ను విచారణ చెయ్యటానికి ఇక్కడ ఎవరికీ అధికారం లేదు. నేను విజయనగర చక్రవర్తి నుంచి ఢిల్లీ పాదుషాను చూడబోతున్నాను. ఇదిగో నా అధికార పత్రం," అన్నాడు రామ లింగడు రౌద్రంగా.

అందరూ అది చూసి నిర్ఘాంతపోయి వెనక్కు తగ్గారు. ఆ గ్రామంలో ఉండే బ్రాహ్మణులు మాత్రం తెనాలిరామలింగణ్ణి కొనియాడి, "బాబూ, ఈ దుర్మార్గు డిక పురాణం మాట ఎత్తడు. మా ప్రాణాలు కాపాడావు," అన్నారు. వారు అతన్ని రెండు రోజులపాటు తమ ఇళ్ళలో అతిథిగా ఉంచుకుని తరవాత సాగనంపారు.






# అప్సరస సంతతి

ఆదికాలంలో మానవులు అంద విహీనులుగా ఉండేవారు. వారిలో సౌందర్యవంతులు పుట్టుకు రావటానికి కారణం ఒక అప్సరస. ఆమె కథ ఇలా చెబుతారు.

దేవలోకంలో, సుభ్రమ అనే ఒక అప్సరస ఉండేది. ఆమె ఇతర అప్సరసల లాగా ఏ దేవతనో వరించి స్వర్గసుఖాలు అనుభవించటానికి బదులుగా భూలోకంలోకి వెళ్ళి అక్కడ ఉండాలని కలలు కనసాగింది. భూలోకంలో సుఖ సౌఖ్యాలుండవనీ, అక్కడి మానవులే స్వర్గసుఖాల కోసం ఎన్నో రకాల వ్రతాలూ, దానాలూ, యజ్ఞాలూ, తపస్సులూ చేస్తారనీ తోటి అప్సరసలు సుభ్రమకు చెప్పారు. కాని సుభ్రమకు భూలోకంలో ఉండాలన్న మోజు తగ్గటానికి బదులు హెచ్చిపోయింది.

చివరకి సమాచారం ఇంద్రుడి దాకా వెళ్ళింది. ఇంద్రుడు సుభ్రమను పిలిపించి, "నీవు భూలోక వాసం కోసం తపించి పోతున్నావట. స్వర్గలోక వాసులు ఇతర లోకాలకు పోవటంలో తప్పేమీ లేదు. కాని నీవు భూలోకానికి వెళ్ళినప్పుడు అక్కడి వస్తు వేదైనా నీకు తగిలిన పక్షంలో నీవు శిలవైపోతావు. ఆ సంగతి గుర్తుంచుకో," అని హెచ్చరించాడు.

ఇంద్రు డీ మాట అనటంతో సుభ్రమకు ఇంద్రుడి అనుమతి లభించినట్టే అయింది. తనకు భూలోకానికి వెళ్ళాలన్న కోరిక ఉన్నట్టు ఇంద్రుడికి తెలిపి, ఆయన అనుమతి పొందడ మెలాగా అని ఇంత కాలంగా తటపటాయిస్తున్న సుభ్రమ ఇంద్రుడి వద్ద సెలవు పుచ్చుకుంటూనే భూలోకానికి ప్రయాణం కట్టింది.

ఆమె తన చెలికత్తెను వెంటబెట్టుకుని భూలోకానికి వచ్చి, ఆకాశాన సంచరిస్తూ భూమి మీద గల వింతలన్నీ చూస్తూ

ఎస్. హరిప్రసాద్



వేడుకపడసాగింది. ఆమె తన చెలికత్తెతో సహా భూమికి మరింత దగ్గరలో ఎగురుతూండగా, ఒక వనంలో ఒక మనిషి ఎత్తయిన చంపక వృక్షం ఎక్కి పూలు కోస్తూ వాళ్ళని చూసి ఆశ్చర్యపోయాడు. ఆకాశంలో తేలి వచ్చే ఆ అందగత్తెలను సమీపంలోకి రానిచ్చి ఆ మనిషి, తాను కోసిన పూలు వారి పైన విసిరాడు. వాటిలో ఒకటి సుభ్రమకు తగిలి, ఆమె నల్ల రాయిగా మారి నేల పైన పడిపోయింది. ఆమె చెలికత్తె తనకు పూలు తగలకుండా తప్పుకుని, స్వర్గానికి తిరిగిపోయి, ఇంద్రుడితో జరిగిన సంగతి చెప్పింది.

ఇంద్రుడు విచారించి, "ఆ రాతిని ఉన్న చోటు నుంచి ఎవరైనా కదిలించినప్పుడు ఆమెకు తిరిగి యథా రూపం వచ్చేటట్టూ, ఆమె ఎవరైనా మానవుణ్ణి పెళ్ళాడి సంతానం కన్న తరవాత తిరిగి స్వర్గానికి వచ్చేసేటట్టూ చేస్తాను," అని ఆమెకు మాట ఇచ్చాడు.

"దేవేంద్రా, ఎక్కడో వనంలో రాయిగా పడివున్న దాన్ని మనుషులు ఎందుకు కదిలిస్తారు ? నా సఖి అలా ఎంత కాలం రాయిగా పడి ఉంటుందోగద!" అని సుభ్రమ చెలికత్తె వాపోయింది.

"అట్టే విచారించకు. దానికి కూడా ఏదో ఒక ఉపాయం చేస్తానులే," అన్నాడు ఇంద్రుడు.

ఈ లోపల చెట్టు మీద ఉన్న మనిషికి ఆ స్త్రీలు అదృశ్యమైపోయా రనిపించింది. అతను వాళ్ళ కోసం ఆకాశ మంతా చాలా సేపు చూసి, చివరకు తన పని ముగించుకుని, చెట్టు దిగి వస్తూ కొద్ది దూరంలో పడివున్న నల్ల రాతిని చూశాడు.

"ఇంతకు మునుపు నే నిటుగా వచ్చినప్పు డీ రాయి లేదే! ఇంతలో ఎలా వచ్చివుంటుంది ?" అనుకుంటూ అతనా రాయిని కాలితో తన్నాడు. వెంటనే రాతి

నుంచి నాలుగు ముత్యాలు రాలాయి. వాడు ఆశ్చర్యం చెంది, ఆ ముత్యాలు ఏరుకుని, రాతిని మరొకసారి తన్నాడు, కాని ఈ సారి ఏమీ రాల లేదు.

వాడు ఊళ్ళోకి వెళ్ళి తన ఆప్తులతో జరిగిన దంతా చెప్పాడు. ఆకాశంలో చాలా అందమైన స్త్రీలు ఎగురుతూ కనిపించా రంటేనూ, రాతిని తన్నితే ముత్యాలు రాలా యంటేనూ వాళ్ళు నమ్మలేకపోయారు. కాని వారిలో కొందరు రాయి పడి ఉన్న చోటికి వచ్చి, తాము కూడా దాన్ని తన్ని చూశారు. ఎవరు తన్నినా నాలుగేసి ముత్యాలు మొదటి సారి రాలాయి. ఆ తర వాత మళ్ళీ రాలలేదు.

రాతిని తన్ని ముత్యాలు సంపాదించే అవకాశం ఎవరికైనా ఒక్కసారే ఉంటుంది గనక ఈ విషయాన్ని ఎవరూ దాచి ఉంచ లేదు. త్వరలోనే చుట్టు పక్కల వాళ్ళంద రికీ తెలిసిపోయింది. జనం తీర్థ ప్రజ లాగా వచ్చి రాతిని తన్ని ముత్యాలు ఏరుకు పోతున్నారు. జనం జాస్తి అయినకొద్దీ రాతి చుట్టూ రద్దీ జాస్తి అయింది; కొట్లాటలు సాగాయి. అధికార్లు వచ్చి రాయి తన్నేవారికి ఒక క్రమమూ పద్ధతీ ఏర్పాటు చెయ్యవలసి వచ్చింది. ఈ సంగతి రాజుగారి దాకా



పోయింది. రాతి నుంచి ముత్యాలు పొందిన వారంతా రాజుగారి వద్ద చీట్లు పొందాలనీ, దొరికిన ముత్యాలలో ఒక వంతు రాజు గారికి చెల్లించాలనీ ఆయన శాసనం చేశాడు. దూర ప్రాంతాల నుంచి కూడా జనం రావటానికి రహదార్లూ, మజిలీలూ, సత్రాలూ ఏర్పాటు చేశాడు.

త్వరలోనే ఈ రాయి గురించి పొరుగు రాజ్యాలకు తెలిసింది. ఇతర రాజుల కా రాయి కల్పవృక్షం లాగా కనబడింది. ఎందు కంటే, రోజూ కొత్త వాళ్ళు పుట్టుతూనే ఉంటారు. పుట్టిన ప్రతి బిడ్డా నాలుగేసి ముత్యాలు సంపాదించుకుంటుంది.

అందులో కొంత రాజుగారి బొక్కసానికి చేరు తూనే ఉంటుంది. అందుచేత చుట్టుపక్కల ఉండే రాజు లందరూ రాయిగల రాజు పైన యుద్ధానికి సిద్ధపడసాగారు. ఈ సంగతి తెలిసి రాజుగారు భయపడి ఆ రాతిని అక్కడి నుంచి తీయించి తన కోటలోపలికి భద్రంగా చేర్చమని తన భటులకు ఉత్తరు విచ్చాడు. రాజభటులు వచ్చి అతి కష్టం మీద రాయిని అటూ ఇటూ కుదిపి ఒక పక్కకు పొర్లించారు.

వెంటనే రాయి మాయమై ఒక అపురూప సుందరి వారి ఎదట నిలబడింది. వారిలో కొందరు ఆమెను చూసి భయపడ్డారు, అందరూ ఆశ్చర్యపడ్డారు.

"నీ వెవరు? ఇలా రాయిగా ఎందుకున్నావు? నీది ఏ దేశం? నీ భర్త ఎవరు?" అని వాళ్ళామె నడిగారు.

"నాకు ఒక దేశం లేదు. భర్త లేడు. చేతులారా చేసుకున్న అపరాధానికి నే నిలా రాయి అయిపోయి, మీ దయ వల్ల తిరిగి యథారూపం పొందాను. మీలో ఎవరైనా నన్ను పెళ్ళాడే పక్షంలో నేను భార్యగా ఉంటాను," అన్నది సుభ్రమ.

ఆ భటు లామెను భార్యగా చేసుకోవటానికి భయపడ్డారు. కాని వారిలో ఒకడు సాహసించి, "నా కింకా పెళ్ళి కాలేదు. నన్ను పెళ్ళాడు," అన్నాడు. సుభ్రమ అందుకు సమ్మతించింది.

వారిద్దరూ వివాహం చేసుకున్నారు. కొంత కాలానికి సుభ్రమ ఒకేసారిగా ఒక మగపిల్లవాణ్ణీ, ఆడపిల్లనూ కని స్వర్గానికి వెళ్ళి పోయింది. అప్పటి వరకూ మానవులు వికారాకారులుగా ఉండేవారు. కాని సుభ్రమ కన్న బిడ్డ లిద్దరూ దేవతలంత గొప్ప అందమైన వాళ్ళు.

ఈ నాడు లోకంలో మనం చూసే అందమైన స్త్రీ పురుషు లందరూ వారి సంతతిన పుట్టిన వాళ్ళే.





# గాజుకొండపైన రాజకుమార్తె

ఉత్తానదేశపు రాజు చాలా పౌరుషం గల వాడు, పరాక్రమవంతుడు. యుద్ధం లేని సమయంలో ఆయన తన పరాక్రమాన్ని వేటలో ప్రదర్శించేవాడు. ఇతర వేటగాళ్ళ లాగా కాక ఆయన భయంకర మృగాలనే వేటాడే వాడు.

అలాటిది ఒకనాడాయనకు అరణ్య మంతా గాలించినా ఒక్క ఘాతుక మృగం కూడా కనిపించలేదు. చివరకాయన చీకటి పడే వేళకు ఇంటికి తిరిగి వస్తుండగా పొదలలో ఏదో కదిలినట్టు కనిపించింది. రాజా జంతువును తరిమి, తన మనుషుల చేత చుట్టు ముట్టింపజేసి పట్టుకునే సరికి, అది ఒక మరుగుజ్జు అడివి మనిషి! ఆ మనిషికి చింపిరి తలా, నిడుపైన గడ్డమూ ఉన్నాయి.

ఆ అడివి మనిషిని రాజు తన ఇంటికి తీసుకువచ్చి, అతని కోసం ఒక కిటికీలు లేని గది కట్టించి, అన్నం అందించటానికి ఒక కంత మాత్రం ఏర్పాటు చేసి, గది తలుపు తాళం వేయించి, తాళం చెవి భద్రంగా తన అంతఃపురంలోనే ఉంచి, "ఈ అడివిమనిషిని ఎవరైతే పారిపోనిస్తారో వారికి మరణ శిక్ష విధిస్తాను," అని ప్రకటించాడు.

కొంత కాలం గడిచాక ఉత్తాన దేశపు పొరుగు రాజ్యం పై శత్రువులు దండెత్తి వచ్చారు. ఆ దేశపు రాజు ఉత్తాన రాజు సహాయం కోరాడు. ఉత్తానరాజు యుద్ధానికి బయలుదేరి పోతూ, అడివి మనిషి ఉండే కొట్టు తాళపుచెవి రాణీకిచ్చాడు. ఆమె ఆ తాళపు చెవిని తన చీరె కొంగున ఉండే తాళపు చెవుల గుత్తితో కలిపి పెట్టేసింది.

ఉత్తానరాజుకు ఒక్కడే కొడుకు. వాడి పేరు ప్రమద్వరుడు. రాజుకు వాడంటే చాలా ముద్దు.

జి. రమణయ్య



కోటలో ప్రతి ఒక్కరికీ ఎంతో ప్రేమ. ప్రమద్వరుడు ఆమెను అప్పుడప్పుడూ చూసి అందరిలాగే ఎంతో ఆనందం పొందేవాడు.

ఏళ్ళు గడిచాయి. ఒక్కొక్క ఏడే గడుస్తున్నకొద్దీ శశికళ సౌందర్యం గురించి దేశదేశాలకూ వార్త పాకింది. ఆమెకు పదహారేళ్ళు నిండాయని తెలియగానే ఎక్కడెక్కడి రాజులూ, రాజకుమారులూ ఆమెను చేసుకుంటామని వచ్చారు. అయితే వారిలో ఒక్కణ్ణి కూడా ఆమె వరించలేదు.

శశివర్ణుడు తన కూతురితో, "అమ్మా, నిన్ను భార్యగా చేసుకునే ఉద్దేశంతో వందమందికి పైగా వచ్చారు. వారిలో కొందరు పెద్ద రాజ్యా లేలేవాళ్ళు, కొందరు అందగాళ్ళు, కొందరు పరాక్రమవంతులు. ఇందరిలో నువు ఏ ఒకణ్ణి వరించినా మిగిలిన వారు సమ్మతిస్తారు. కాని నీకు ఒక్కరూ నచ్చలేదంటే, అందరూ ఏకమై మనను నామారూపాలు లేకుండా చేసేస్తారు. ఇంత మంది ఆగ్రహానికి నే నెలా తట్టుకుంటాను? నువు ఒకణ్ణి ఎన్నుకో లేని పక్షంలో నేనే ఎవరో ఒకణ్ణి ఏరి, నిన్ను పెళ్ళి చేసేస్తాను. నేను నిర్ణయించిన వాడు నీకు నచ్చకపోతే విచారించి లాభం ఉండదు," అన్నాడు.

ఈ మాట విని శశికళ కంగారు పడిపోయి, "అలా మాత్రం చెయ్యకు. కావలిస్తే నన్ను పెళ్ళాడ గోరిన వారికి ఒక పోటీ ఏర్పాటు చేయించు. మన రాజ భవనానికి సమీపంలో ఉన్న గాజు కొండ శిఖరం పైన నేను ఒక పండు తీసుకుని కూర్చుంటాను. గుర్రం మీద ఆ కొండ ఎక్కి నా చేతి నుంచి పండు తీసుకోగల వాణ్ణి నేను పెళ్ళాడతాను," అన్నది.

రాజు కిది సరువైన పద్ధతిగా తోచింది. ఆయన, తన కుమార్తెను పెళ్ళాడ గోరిన వారందరూ పోటీలో పాల్గొనవలసి ఉంటుందని చెప్పాడు. పోటీ వివరాలకు అందరూ సమ్మతించారు.

ఒక మంచి రోజు చూసి పోటీ ఏర్పాటు చేశారు. శశికళను గాజు కొండ పై భాగాన ఒక సింహాసనం పైన కూర్చోబెట్టారు. ఆమెను పెళ్ళాడగోరి వచ్చిన వారందరూ గొప్పగా దుస్తులు ధరించి, గుర్రా లెక్కి కొండ కిందికి వచ్చారు. వారు ఒకరి తరవాత ఒకరుగా తమ గుర్రాలను కొండ పైకి ఎక్కించాలని ప్రయత్నించారు, కాని ఒక్కరికీ ఆ పని సాధ్యం కాలేదు. చాలా గుర్రాలు కొంత దూరం ఎక్కి కిందికి జారి పడిపోయాయి. కొన్నిటికి కాళ్ళు విరిగాయి, గుర్రాల మీద ఉన్నవారిలో కొందరికి నడుములు కూడా విరిగాయి. వేడుక చూసే వాళ్ళు కోలాహలం చెయ్యసాగారు.

కోట గోడల వెలపల గొర్రెలను మేపుతున్న ప్రమద్వరుడీ కోలాహలాన్ని విన్నాడు. అత నిప్పుడు యుక్త వయస్కుడు. రాజకుమార్తె శశికళను పెళ్ళాడాలన్న కోరిక మిగిలిన వాళ్ళ కెంత ఉన్నదో అతనికీ అంతా ఉన్నది.

"నిజానికి నేనూ రాజకుమారుణ్ణే! మిగిలిన రాజులతో బాటు శశికళ కోసం పోటీ చెయ్యవలసిన వాణ్ణే! కాని ఆ మరుగుజ్జు వాడి మూలాన నా కీ దుస్థితి కలిగింది!" అనుకున్నాడు ప్రమద్వరుడు.




అత నీ మాట అనుకుంటున్న క్షణంలోనే మరుగుజ్జు అడివి మనిషి అరణ్యంలో నుంచి అతనికేసి వస్తూ కనబడ్డాడు. అతను ప్రమద్వరుణ్ణి సమీపించి, "ఏమిటలా విస్తుపోయి ఉన్నావు?" అని అడిగాడు.

"నీ మాటే అనుకుంటున్నాను. నీ మూలంగా నేను రాజకుమార్తె కోసం పోటీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయాను," అన్నాడు ప్రమద్వరుడు.

"ఎవరన్నారు? నా వెంటరా. నీకు కావలిసిన దుస్తులూ, గుర్రమూ ఇస్తాను," అంటూ మరుగుజ్జువాడు అతన్ని అరణ్యంలో ఉన్న కొండలలో ఒక గుహ



# వాక్సిద్ధి గలవాడు

ఒక వూళ్ళో వేదోపాధ్యాయుడనే పౌరోహిత్యపు బ్రాహ్మణు డుండేవాడు. ఆ పౌరోహిత్యంతో ఆయనకు సరిగా జరుగుబాటు అవుతూండేదికాదు. ఎవరో ఆయన జాతకం చూసి, పెళ్ళి చేసుకున్న తరవాత ఆయనకు కొద్దిగా అదృష్టం కలిసి వస్తుందన్నారు. వారి మాటలలో నమ్మకం ఉంచి వేదోపాధ్యాయుడు, తనకు భార్యను పోషించే శక్తి ఏమాత్రమూ లేకపోయినా, గంగమ్మ అనే బీద ఇంటి పిల్లను పెళ్ళి చేసుకున్నాడు.

పెళ్ళి చేసుకున్నాక వేదోపాధ్యాయుడికి పౌరోహిత్యాల మీద రాబడి హెచ్చిన మాట నిజమేగాని, ఒకరికి ఇద్దరి కడుపులు నిండవలిసి రావటంచేత ఆయన దారిద్ర్యం ఏమంత తీరలేదు. ఆయన మరొకసారి జ్యోతిష్కులకు తన జాతకం చూపించి, తనకు మంచి భవిష్యత్తు ఏమైనా ఉంటుందా ఉండదా అని అడిగాడు. పుత్రసంతానం కలిగిన మీదట ఇంకా మంచి రోజులు వస్తాయని జ్యోతిష్కులు చెప్పారు.

కొంతకాలం గడిచాక గంగమ్మ గర్భవతిగా ఉండి ఒక మగ బిడ్డను కన్నది. వేదోపాధ్యాయుడికి వాడు పుట్టిననాడే మంచి సంభావన దొరికింది. ఆయన పిల్లవాడికి సిద్ధవేది అని పేరు పెట్టుకుని తనకు మంచి రోజులు వస్తాయన్న నమ్మకంతో ఉన్నాడు.

సిద్ధవేది పుట్టాక పౌరోహిత్యం మీద వేదోపాధ్యాయుడి రాబడి మరి కొంచెం పెరిగింది, అయితే దానితోబాటు ఖర్చు కూడా ఆ ప్రమాణంలోనే పెరిగింది. అందుచేత తన జీవితంలో కొత్త దశ ప్రారంభమయిందన్న భావం ఆయనకు కలగలేదు.

వేదోపాధ్యాయుడికి జాతకాలలోనే గాక, ప్రశ్నలూ, శకునాలూ, కేరళం మొదలుగా గల సమస్తమైన వాటిలోనూ నమ్మకం ఉండేది. సిద్ధవేదికి కాస్త మాటలు వస్తున్న

ఆర్. భగవాన్‌దాసు

రోజుల్లోనే ఒకనాడు తండ్రి ఏదో ప్రశ్న వేసుకుని కొడుకు దగ్గిరికి వచ్చి, "ఉంటుందా? పోతుందా?" అని అడిగాడు.

"పోతుంది," అన్నాడు సిద్ధవేది.

తన భర్త గుడ్డి నమ్మకాలు గంగమ్మకు తెలుసు. అందుచేత పసివాడు "పోతుంది," అనటం తన భర్త కెక్కడ కోపం తెప్పిస్తుందో నని ఆమె చాలా భయపడింది. ఎందుకంటే, తన మనసుకు నచ్చని మాట ఎవరన్నా అంటే వేదోపాధ్యాయుడికి ఒళ్ళు తెలియని కోపం వచ్చేది.

అయితే ఈసారి వేదోపాధ్యాయుడు తన కొడుకు మాటకు ఎంతో సంతోషిస్తూ, "నా బంగారుతండ్రే! నీ నోటి చలవన అలాగే జరగాలి," అన్నాడు.

ప్రాణం కుదుటపడి గంగమ్మ, "మీ రేమని అడిగారు? వా డేంచెప్పాడు?" అని భర్త నడిగింది.

"మన దారిద్ర్యం ఇలాగే ఉంటుందా? ఎప్పటికైనా పోతుందా? అని అబ్బాయిని ప్రశ్న వేశాను. వాడు పోతుందని తడవకుండా చెప్పేశాడు!" అన్నాడు వేదోపాధ్యాయుడు. అది మొదలు ఆయన తన కొడుకును జాగ్రత్తగా గమనిస్తూ పచ్చాడు. వాడి నోటంట పచ్చిన మాట జరిగి తీరు




తుందని ఆయనకు అనుమానం కలిగింది. ఆయన వాడికి రకరకాల పరీక్షలు పెట్టాడు.

ఒకసారి మొండి గోడమీద పిల్లి కూర్చుని కనిపించింది. వేదోపాధ్యాయుడు తన కొడుక్కు ఆ పిల్లిని చూపించి, "సిద్ధా, పిల్లి మనవేపు దూకుతుందా, అవతలిపక్క దూకుతుందా?" అని అడిగాడు.

"మనవైపే దూకుతుంది, నాన్నా," అన్నాడు కొడుకు. మరి కాస్సేపటి కా పిల్లి వాడు చెప్పినట్టే దూకింది.

ఇటువంటి చిన్న చిన్న ప్రశ్న లన్నిటికీ సిద్ధవేది ఏ సమాధానం చెప్పినా అది నిజమవుతూ వచ్చింది. తన కొడుకు వాక్సిద్ధితో

"ఇంకొక అరగడియలో, ఇక్కడ పడుతుంది," అంటూ సిద్ధవేది కాయకు దిగువగా నేల పైన పుల్లతో ఒక గుర్తు వేశాడు.

వెంటనే రాజు తన తోటవాణ్ణి పిలిచి, "ఒరే, నువు చెట్టెక్కి వెంటనే ఆ కాయ కోసి కిందికి దిగిరా!" అన్నాడు.

అయితే ఆ క్షణంలో అక్కడ ఉన్న మనిషికి కొబ్బరి చెట్టెక్కటం చేతకాదు. వాడు ఎక్కడికో వెళ్ళి నిచ్చెన తెచ్చి, చెట్టుకు వేసి పైకి ఎక్కేసరికి అరగడియ పట్టనే పట్టింది. రాలటానికి సిద్ధంగా ఉన్న ఆ కొబ్బరికాయ వాడి చెయ్యి తగులుతూనే సిద్ధవేది పెట్టిన గుర్తు మీద పడింది.

"ఇంకొక్క ప్రశ్న: నే నిప్పుడు కోట బయటికి వెళ్ళి తిరిగి లోపలికి రాబోతున్నాను. ఏ ద్వారం కుండా వెళతానో, ఏద్వారం కుండా తిరిగి కోట ప్రవేశిస్తానో రాసి పెట్టు. నేను తిరిగి వచ్చి నీ సమాధానం చూస్తాను," అన్నాడు రాజు.

క్షణంలో సిద్ధవేది కాగితం పైన సమాధానం రాసి పెట్టాడు. వాడు రాయటం పూర్తి అయాక రాజుగారు కోట గోడకు నిచ్చెన వేయించి గోడ పైకెక్కి ఆ నిచ్చెననే అవతల పక్క వేయించి దిగబోతూ, నిచ్చెన పైన కాలు జారి కిందపడ్డాడు. వెంటనే రాజభటులు రాజుగారిని సమీపంలో ఉన్న ద్వారం కుండా లోపలికి మోసుకొచ్చారు.

రాజుగారు తనకు తగిలిన దెబ్బ కూడా లక్ష్యపెట్టక సిద్ధవేది రాసిన సమాధానం అందుకుని ఇలా చదివాడు. "రాజుగారు ఏ ద్వారం నుంచీ బయటికి వెళ్ళరు; ఈ సమీపంలో ఉన్న ద్వారం కుండా లోపలికి చేరుకుంటారు."

రాజుగారికి కూడా సిద్ధవేది వాక్సిద్ధిలో పూర్తిగా నమ్మకం కుదిరింది. ఆయన ఆ కుర్రవాడికి అంతులేని డబ్బిచ్చి, ఒక మంచి మాన్యం కూడా బహుమానంగా ఇచ్చేశాడు.





# గాలివాన

పాపన్న నివసించే ప్రాంతంలో ఆ యేడు వరదలు వచ్చి, నది పక్కన ఉన్న పల్లపు భూములు మునిగిపోయాయి.

పాపన్న ఉండే వీధిలోనే ఉండే వీరన్న అనేవాడు వచ్చి, "ఇదేమిటి పాపన్నా? అందరికీ ఉపకారం చేసేవాడివి, ఇంట్లోనే ఉన్నావేం? గ్రామాలు మునిగిపోయాయుట. జనం ప్రాణాలు దక్కించుకుని మెరక ప్రాంతాలకు పోయారట. నువు అక్కడికి పోయి ఉంటా వనుకున్నాను," అన్నాడు.

"ఊళ్ళకు ఊళ్ళే మునిగిపోతే నే నొక్కణ్ణి వెళ్ళి ఏం సహాయం చెయ్యగలను వీరన్నా?" అన్నాడు పాపన్న.

"ఇదేనా నీ పరోపకారం? పోదాం పద. ఏ ఒక్క రిద్దరికైనా చేతనైన సహాయం చేద్దాం," అన్నాడు వీరన్న.

ఇద్దరూ కలిసి వరద ప్రాంతం లోని ఒక గ్రామానికి వెళ్ళారు. ఆ గ్రామం నీటి మధ్య లంక లాగా ఉన్నది. ఆ గ్రామానికి సంబంధించిన వాళ్ళు పడవలలో తమ ఇళ్ళ నుంచి సామాన్లు మెరక ప్రాంతానికి తెచ్చుకుంటున్నారు.

గ్రామం నుంచి బయటపడి మెరక ప్రాంతానికి వచ్చి చేరినవారి కలకలం కూడా జాస్తిగానే ఉన్నది. వారిలో ఒక ఆడదీ, పిల్లలూ పాపన్న కంట పడ్డారు. వాళ్ళు కనిపించిన వాళ్ళ నందరినీ పిలుస్తున్నారు. కాని ఎవరూ వాళ్ళ మాట వినిపించుకోవటం లేదు. పాపన్నా, వీరన్నా వాళ్ళను సమీపించి, "మీకు వచ్చిన కష్ట మేమిటి?" అని అడిగారు.

"అడుగోనండీ, ఆ కనిపించే ఇంటి కప్పు పైన మా తాత చిక్కుకు పోయాడు. నిన్న రాత్రి వర్షం ప్రారంభం కాగానే మమ్మల్ని ముందు పంపేసి, వెనకగా తాను ముఖ్యమైన సామాన్లు తెస్తానని ఉండి

చెంబును ఒంచే సరికి, రంధ్రంలో నుంచి, రంగురంగుల ఇసుకా, చిన్న చిన్న గవ్వలూ బయటికి వచ్చాయి. వా డది చూసి మండి పడి, చెంబును వీరన్న నెత్తి కేసి గురిగా విసిరాడు. వీరన్న ఒక్క కేక పెట్టి పడి పోయాడు. దొంగవా డతన్ని సమీపించి, సోదా చేసి, అతని ఉంగరమూ, చిల్లర డబ్బులూ కాజేసి పారిపోయాడు.

అక్కడ పాపన్న తెచ్చిన చెంబును చూడగానే ముసలాడికి ప్రాణం లేచి వచ్చింది. "ఈ చెంబు మాకు నీటిలో దొరికింది," అన్నాడు పాపన్న.

"మా ఇల్లు నిలబెట్టావు, నాయనా. నా కొడుకు పొరుగూరిలో ఉన్నాడు. ఇల్లు చాలా పాతది. కొత్త ఇల్లు కట్టుకుందా మని, ఈ చెంబులో డబ్బులూ, నగలూ దాచి ఉంచాను. గాలి వాన రావటం చూసి, ఏ మవుతుందో నని భయపడి, నిన్ననే ఈ చెంబుకు మూత పెట్టి సీలు వేశాను. ఇది దొరకటం చాలా మేలయింది. ఇలాటిదే ఇంకో చెంబు కూడా ఉండాలి. అందులో కన్యాకుమారి నుంచి తెచ్చిన రంగుల ఇసుకా, పూసలు, శంఖాలు అవీ, ఉండాలి. అది నేను పూజ చేసుకునే చెంబు," అన్నాడు ముసలివాడు.

పాపన్న వాళ్ళను వదిలి తిరిగి వస్తూం డగా దారిలో వీరన్న కనిపించాడు. అతను లేచి కూర్చుని, తల పట్టుకుని మూలుగు తున్నాడు. అతని పక్కన చెంబున్నది.

"ఈ చెంబు కూడా ఆ ముసలాడిదే!" అంటూ పాపన్న చెంబు తీసుకోవటానికి వంగే సరికి, దొంగవాడి చేతి నుంచి జారి పడిన ముక్కుపుడక కూడా దొరికింది. పాపన్న వాటిని తీసుకుపోయి వృద్ధుడి కిచ్చేసి, తిరిగి వచ్చి, వీరన్నను గ్రామానికి నడిపించుకుపోయి, అతని తలకు తగిలిన గాయానికి మందు వేయించి సూర్యాస్త మయాని కల్లా ఇల్లు చేరుకున్నాడు.






**జాం**బవంతుడు ప్రేరేపించగా **హను**మంతుడు వాయు వేగంతో ఆకాశ మార్గాన హిమాలయ పర్వతాలకు పోయి, అక్కడ ఉన్న మంచు శిఖరాలూ, గుహలూ, గొప్ప క్షేత్రాలైన బ్రహ్మకోశమూ, కైలాసమూ, హయగ్రీవమూ, బ్రహ్మకపాలమూ, కుబేర స్థానమూ, పాతాళరంధ్రమూ, కాంచన శృంగమూ, రాత్రులు కూడా ప్రకాశించే సర్వౌషధి పర్వతమూ చూస్తూ, సర్వౌషధి పర్వతం పైన దిగి, ఓషధుల కోసం వెదక సాగాడు. ఆ సంగతి తెలిసి దివ్యౌషధులు అంతర్ధానమయాయి.

హనుమంతుడికి పట్టరాని కోపం వచ్చింది. అతను పెద్దపెట్టున అరిచి పర్వతంతో, "రాముడి పైన జాలి తలవ రాదని నిశ్చయించుకున్నావా ఏమిటి? నిన్ను నా చేతులతో పెరికి, పిండి చేసేస్తాను," అన్నాడు. అంటూనే **హను**మంతుడు ఆ పర్వత శిఖరాన్ని పెకలించి తిరిగి ఆకాశ మార్గం పట్టాడు.

పర్వత శిఖరంతో సహా తిరిగి వస్తున్న హనుమంతుణ్ణి చూసి వానరులు గట్టిగా అరిచారు. పని చేసుకుని వస్తున్న ఆనందంలో **హను**మంతుడు కూడా అరిచాడు. ఈ అరుపులూ, ఆ అరుపులూ విన్న రాక్షసులు భయంతో అరిచారు.

హనుమంతుడు ఓషధి పర్వతంతో సహా త్రికూట పర్వతం మీద వానర సేన మధ్య వాలి, ప్రముఖ వానరులకు నమస్కారాలు చేసి, విభీషణుణ్ణి కౌగిలించుకున్నాడు.



రామ లక్ష్మణులూ, ఇతర వానర వీరులూ దివ్యౌషధుల వాసనకు బాణాల బాధ పోగొట్టుకున్నారు. యుద్ధంలో చచ్చిపోయిన వానరులు సైతం దివ్యౌషధుల గాలి సోక గానే నిద్ర లేచిన వారి లాగా లేచికూర్చు న్నారు. వానరులు యుద్ధంలో చని పోయిన రాక్షసుల నందరినీ సముద్రంలో పడవేశారు. హనుమంతుడు ఓషధి పర్వత శిఖరాన్ని తీసుకుపోయి యథాస్థానంలో ఉంచి తిరిగి వచ్చాడు.

అప్పుడు సుగ్రీవుడు హనుమంతుడితో, "తమ్ముడైన కుంభకర్ణుడూ, కొడుకులూ చచ్చారు గనుక ఇప్పుడు రావణుడు యుద్ధా నికి రాడు. మనలో బల వేగాలు గల వాన రులు ఈ రాత్రి దివిటీలు తీసుకుని వెళ్ళి లంకపై పడాలి," అన్నాడు.

సూర్యాస్తమయమై భయంకరమైన రాత్రి రాగానే వానర వీరులు దివిటీలు పట్టుకుని లంక కేసి వెళ్ళారు. వారి ధాటికి బెదిరి నగర ద్వార రక్షకులైన రాక్షసులు పారిపోయారు. తమను అడ్డే వా రెవరూ లేక, వానరులు నగరం ప్రవేశించి, ద్వారాల లోనూ, బురుజుల లోనూ, రాజ వీధుల లోనూ, ఇతర వీధు లన్నిటా నిప్పు పెట్టారు. లంక అంతా అంటుకుని తగలబడ సాగింది. ఆకాశ మంత ఎత్తున్న మేడలు కాలి, కూలి పోయాయి. ఇళ్ళతో బాటు విలువ గల వస్తువులూ, వస్త్రాలూ, శాలువలూ, రత్న కంబళాలూ, నగలూ, ఆయుధాలూ, కవ చాలూ, సమస్తమూ తగలబడిపోయాయి. అనేక మంది రాక్షసులు కాలిపోయారు. రాక్షస స్త్రీలు హాహాకారాలు చేశారు. గుర్రాలూ, ఏనుగులూ కట్లు తెంచుకుని భీభత్సంగా పరిగెత్తాయి. తగలబడి పోతున్న లంకా నగరం సముద్రంలో ప్రతిబింబించి సముద్రం కూడా ఎర్రగా కనబడింది.

ఒక వంక వానరులు సంతోషం తోనూ, రాక్షసులు దుఃఖం తోనూ కేకలు పెడు



తూంటే, రెండు ధ్వనులనూ మించి రాముడి బాణం చేసే ధ్వని వినపడింది. అది విని రాక్షసులు యుద్ధానికి సిద్ధపడ్డారు.

రావణుడి అంతఃపుర ద్వారం వద్దకు వెళ్ళి యుద్ధం చేయవలసిందిగా సుగ్రీవుడు వానరోత్తముల నాజ్ఞాపించాడు. వానరులు దివిటీలతో సహా ద్వారంలో నిలబడటం రావణుడు చూసి మండిపడి, ఆ వానరులను చంపి రమ్మని నికుంభుడూ, కుంభుడూ అనే వాళ్ళను, కుంభకర్ణుడి కొడుకులను, పంపాడు. వాళ్ళు అనేకమంది రాక్షస వీరులను వెంట బెట్టుకుని బయలుదేరి వచ్చారు. వానరులకూ రాక్షసులకూ తీవ్రమైన యుద్ధం జరిగింది. అనేక మంది రాక్షస వీరులు చచ్చారు. అంగదుడు మూర్ఛపోయాడు. చివరకు కుంభుడు సుగ్రీవుడి చేతిలో చచ్చాడు. అతని తమ్ముడైన నికుంభుణ్ణి హనుమంతుడు దారుణంగా చంపేశాడు. కుంభ నికుంభులు చావగానే వానరులు సింహనాదాలు చేశారు. రాక్షసులు భయపడ్డారు.

తరవాత రావణుడు వానరులతో యుద్ధం చెయ్యటానికి ఖరుడి కొడుకైన మకరాక్షుణ్ణి వెళ్ళమన్నాడు. మకరాక్షుడు రాక్షస సేనతో సహా రామ లక్ష్మణులతో యుద్ధం



చెయ్యటానికి బయలుదేరి వెళ్ళాడు. రాక్షసుల బాణ వర్షం ముందు తాళలేక వానరులు పారిపోయి వస్తుంటే వెంట తరుముకుంటూ వచ్చే రాక్షసులను రాముడు తన బాణాలతో నిలవేశాడు. తన తండ్రి అయిన ఖరుణ్ణి చంపినందుకు రాముణ్ణి చంపి పగ తీర్చుకుంటా నని మకరాక్షుడు ప్రగల్భాలాడాడు.

"మాటలతో విజయం కలగదు! యుద్ధం చెయ్యి," అన్నాడు రాముడు. ఇద్దరూ తలపడి భయంకరమైన యుద్ధం చేశారు. మకరాక్షుడు తన సారధినీ, గుర్రాలనూ, రథాన్నీ పోగొట్టుకుని చివరకు రాముడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రంతో





చచ్చి పడిపోయాడు. అతని వెంట ఉన్న రాక్షసు లందరూ నగరంలోకి పారిపోయారు.

మకరాక్షుడి మరణ వార్త విని రావణుడు కోపోద్రేకంతో పళ్ళు పటపట కొరికి, తన కొడుకైన ఇంద్రజిత్తును పిలిచి, "నాయనా దృశ్యంగానో, అదృశ్యంగానో రామ లక్ష్మణులతో యుద్ధం చేసి, వాళ్ళను చంపిరా! ఇంద్రుణ్ణి గెలిచిన నీ కీ మానవమాత్రులొక లెక్కా ?" అన్నాడు.

ఇంద్రజిత్తు తండ్రి ఆజ్ఞ పొంది యజ్ఞశాలకు వెళ్ళి, హోమం చేసి, ఒక నల్ల మేకను బలి ఇచ్చాడు. అగ్ని హోత్రం చక్కగా ప్రజ్వలించి విజయం సూచించింది.

ఇంద్రజిత్తు అదృశ్య శక్తి గల తన రథమెక్కి, యుద్ధరంగానికి వెళ్ళి, వానర సేనలో ఉన్న రామ లక్ష్మణులను గుర్తించి, వారిపై బాణాలు వర్షం లాగా కురిపించ సాగాడు. ఇంద్రజిత్తు ఆకాశంలో ఎటుగా ఉన్నదీ కాన రాక, రామ లక్ష్మణులు ఆకాశ మంతా బాణాలతోనూ, దివ్యాస్త్రాలతోనూ నింపేశారు.

ఇంద్రజిత్తు వేసే బాణాలు ఎటునుంచి వస్తున్నదీ కనిపెట్టి, రామ లక్ష్మణులు అటుగా తమ బాణాలను ప్రయోగించారు. అయితే ఇంద్రజిత్తు ఆకాశ మంతటా సంచరిస్తూ ఉండటం చేత వారి బాణా లతనికి తగల లేదు. ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణాలతో రామ లక్ష్మణుల శరీరాల రక్తప్రవాహాలు కారాయి, వానరులు గుంపులు గుంపులుగా చచ్చారు. లక్ష్మణుడికి కోపం వచ్చి, "బ్రహ్మాస్త్రం ప్రయోగించి రాక్షసుల నందరినీ చంపేస్తాను," అన్నాడు.

"ఒక్కడి కోసం మనతో యుద్ధం చెయ్యని వారందరినీ చంపటం ఉచితం కాదు. చేతనైతే ఇంద్రజిత్తు నొక్కణ్ణే చంపుదాం," అన్నాడు రాముడు.

అంతలో ఇంద్రజిత్తు ఒక మాయ ఆలోచించాడు. అత నొక మాయ సీతను



చేసి, ఆమెను రథం మీద పెట్టుకుని, వానరులు చూస్తుండగా ఆమెను చంపి, రామ లక్ష్మణులకు మనస్తాపం కలిగించే ఉద్దేశ్యంతో వానర సేన కెదురుగా వచ్చాడు. ఇంద్రజిత్తు కళ్ళకు కనపడగానే వానరులు యుద్ధోత్సాహం చెందారు. హనుమంతుడు ఒక పెద్ద పర్వత శిఖరం పట్టుకుని వానరులకు ముందు నిలబడ్డాడు.

అంతలో హనుమంతుడికి ఇంద్రజిత్తు రథంలో సీత కనిపించింది. ఆమె మాసిన బట్ట కట్టుకుని, దుమ్ము కొట్టుకుని, దీన వదనంతో, తాను కొద్ది కాలం క్రితం చూసి నట్టుగానే ఉన్నది. సీత ఇంద్రజిత్తు రథంలో



ఉండటం చూసి హనుమంతుడు చాలా బాధపడి, ఏ ఉద్దేశంతో ఇంద్రజిత్తు ఆమెను తెస్తూ ఉండి ఉంటాడా అని ఆలోచించి, పక్క వారిని అడుగుతుండగా ఇంద్రజిత్తు మాయా సీతను జుట్టు పట్టుకుని, కత్తితో కొట్టాడు. ఆమె "రామా! రామా!" అంటూ ఏడ్చింది.

హనుమంతుడు ఇంద్రజిత్తు ముందుకు వెళ్ళి, అతన్ని నానా తిట్లూ తిట్టి, "ఈ సీత నీ కే విధమైన అపకారం చేసింది? ఆమె నెందుకు చంప జూస్తున్నావు?" అని అడిగాడు.

"ఈ సీత మూలానే గదా సుగ్రీవుడూ, రాముడూ ఈ లంకకు వచ్చారు? ఈమెను ఇప్పుడు నీ ఎదటే చంపి, ఆ తరవాత రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ, నిన్నూ, సుగ్రీవుణ్ణీ, ఆచారం పోగొట్టుకున్న ఆ విభీషణుణ్ణీ చంపేస్తాను," అన్నాడు ఇంద్రజిత్తు. వెంటనే అతను తన చేతి కత్తితో మాయా సీతను నరికేశాడు.

"నీ కళ్ళ ఎదటనే సీతను చంపేశాను. ఇక మీ ప్రయత్న మంతా వృథా!" అంటూ ఇంద్రజిత్తు పెద్ద పెట్టున సింహనాదం చేశాడు. వానరులు భయపడి పారిపోసాగారు.



అప్పుడు హనుమంతుడు వారితో, "ఎక్కడికి పారిపోతారు? మీ పరాక్రమ మంతా ఏమయింది? నేను ముందు నడుస్తాను, నా వెంట రండి," అని అందరినీ యుద్ధోన్ముఖులను చేశాడు. అందరూ కలిసి రాక్షస సేనపై పడి చంప నారంభించారు.

హనుమంతుడు ఒక వైపు దుఃఖంతోనూ, మరొక వైపు కోపంతోనూ తపించిపోతూ ఇంద్రజిత్తు పైన ఒక పెద్ద శిల విసిరాడు. కాని అది అతనికి తగలలేదు. అయినా వానరులు హనుమంతుడి చర్యతో ఉత్సాహం వచ్చి రాక్షస సైన్యాన్ని మట్టుబెట్టసాగారు.

హనుమంతు డప్పుడు తోటి వానరులతో, "మనం ఏ సీత కోసం వచ్చామో, ఎవరి కోసం ప్రాణా లొడ్డి యుద్ధం చేస్తున్నామో, ఆ సీత కాస్తా చంపబడింది. ఇంద్రజిత్తు సీతను చంపాడన్న వార్త రాముడికీ, సుగ్రీవుడికీ చెప్పి, వారేం చెయ్యమంటే అది చేద్దాం," అన్నాడు. వానరులు వెనక్కు తిరిగి వెళ్ళిపోయారు. వా రలా వెళ్ళిపోవటం చూసి ఇంద్రజిత్తు హోమం చెయ్యటం కోసం నికుంభిళ చైత్యానికి వెళ్ళాడు.

ఈ లోపల రాముడికి పశ్చిమ ద్వారం వైపు నుంచి యుద్ధ కోలాహలం వినిపించింది. అతను జాంబవంతుడితో, "మన



హనుమంతుడు రాక్షసులతో పెద్ద ఎత్తున యుద్ధం చేస్తున్నట్టున్నది. అతనికి సహాయం వెళ్ళు," అన్నాడు. జాంబవంతుడు పశ్చిమ ద్వారం దిక్కుగా వెళుతూంటే దారిలో హనుమంతుడూ, ఇతర వానర వీరులూ ఎదురుగా రావటం చూశాడు.

హనుమంతుడు యుద్ధ రంగానికి బయలుదేరిన భల్లూక సేనను వెనక్కు మళ్ళమని చెప్పి, త్వరగా రాముడున్న చోటికి వెళ్ళి, తన ఎదుటనే ఇంద్రజిత్తు సీతను చంపేసినట్టు చెప్పాడు.

ఈ మాట వింటూనే రాముడు మొదలు నరికిన చెట్టు లాగా పడిపోయాడు. దూర

దూరంగా ఉన్న వానరులందరూ పరిగెత్తు కొచ్చారు. రాముడి ముఖాన నీరు చల్లారు. లక్ష్మణుడు రాముణ్ణి ఓదార్చాడు. రాముడు లక్ష్మణుడి తొడపై తల పెట్టుకుని ఎంతో దుఃఖించాడు.

అంతలో అక్కడికి విభీషణుడు తన నలుగురు మంత్రులతోనూ వచ్చి, "అందరూ విచారంగా ఉన్నట్టున్నారే? ఏమిటి కారణం?" అని అడిగాడు

"ఇంద్రజిత్తు సీతను చంపేసినట్టు హనుమంతుడు వచ్చి చెప్పేసరికి రాముడు దుఃఖపడుతున్నాడు," అని లక్ష్మణుడు విభీషణుడితో అన్నాడు.

"అదంతా వట్టి మాట. రావణుడు సీతకు అంత కీడు ఎన్నటికీ జరగనివ్వడు. సీతను రాముడి కిచ్చెయ్యమని నే నెంత చెప్పినా సీతను విడిచి ఉండటానికి అంగీకరించని వాడు సీతను చంపనిస్తాడా? ఇంద్రజిత్తు సీతను చూడనైనా లేడు, వా డామెను తెచ్చి చంపగలడా? ఇప్పుడు రావణుడికి ఆ ఇంద్రజిత్తు తప్ప మరెవడూ లేడు. ఇంద్రజిత్తు విజయం కోసం హోమం చెయ్యటానికి నికుంభిళానికి వెళతాడు. ఈ లోపల వానరులు వచ్చి తనకు యజ్ఞ భంగం కలగ చెయ్యకుండా చెయ్యటాని కేదో మాయ పన్నాడు. ఆ మాయ పారింది. మీ రంతా పుట్టెడు దుఃఖంలో ఉన్నారు. అక్కడ వాడు నిర్విఘ్నంగా హోమం పూర్తి చేస్తాడు. ఆ తరవాత దేవతలూ, దానవులూ ఏకమై ఎత్తి వచ్చినా వాడి ముందు నిలవలేరు. కనక నేను చెప్పే దేమంటే, వాడా హోమం పూర్తి చేసే లోగా మనం నికుంభిళానికి పోదాం. రామా! నిర్విచారంగా నీ విక్కడే ఉండి, మా వెంట లక్ష్మణుణ్ణి పంపించు. అతను ఇంద్రజిత్తును చంపగలుగుతాడు. ఏ మాత్రమూ ఆలస్యం లేకుండా బయలుదేరాలి," అన్నాడు విభీషణుడు.






# రుక్మాంగదుడు

## 2

మోహినీ సహితుడై రుక్మాంగదుడు తన నగరానికి తిరిగి వస్తూండగా ఆయన గుర్రం కాలి కింద ఒక ఉడుము పడింది. రుక్మాంగదుడు దాని పైన నీరు చల్లి, దాని ప్రాణాన్ని కాపాడాడు. అప్పు డా ఉడుము రుక్మాంగదుడితో ఇలా అన్నది:

"రాజా, నేను శాఖల నగరంలో ఒక బ్రాహ్మణుడి భార్యను. నా భర్త అందరి తోనూ ఎంతో సాధువుగా ప్రవర్తించే వాడు, కాని నన్ను చూస్తేనే మండిపడే వాడు. ఇది నాకు చాలా బాధగా ఉండేది. తోటి ఆడవాళ్ళతో చెప్పుకుంటే, నా భర్త మందులతో వశుడవుతాడని చెప్పారు. అలాటి మందు లిచ్చే బ్రహ్మచారిణి అయిన యోగిని ఒకతె ఉండేది. నే నామెకు నా చేతి ఉంగర మిచ్చి, ఏదో చూర్ణం పెట్టి కట్టిన రక్షరేకు తీసుకువచ్చి నా భర్త మెడలో కట్టాను. అది మొదలు నా భర్త క్షయ వ్యాధితో బాధపడసాగాడు. ఆ వ్యాధితో క్రమంగా క్షీణించిపోయి, తనను రక్షించ మనీ నాకు దాసుడుగా ఉంటాననీ ఏడ్చాడు. నేను యోగిని దగ్గరకు వెళ్ళి, జరిగిన సంగతి చెప్పి, నా భర్త వ్యాధి పోగొట్ట మన్నాను. యోగిని వేరు ఒకటి ఇచ్చింది. దానితో నా భర్త ఆరోగ్యం పొంది, నాకు విధేయుడుగా ఉంటూ వచ్చాడు. ఇలాటి పాపం చేసినందుకు నే నెన్నో నరక యాతన లనుభవించి, చివరకు ఈ ఉడుము జన్మ ఎత్తాను. నే నింకా ఎన్ని హీన జన్మ లెత్తాలో తెలీదు. అందుచేత నీవు శ్రవణ ద్వాదశీ వ్రతం ద్వారా సంపాదించుకున్న పుణ్యాన్ని నా కిచ్చి నన్ను కాపాడు."

ఇది విని మోహిని, "ఎవరు చేసుకున్న పుణ్య పాపాల ఫలితాన్ని వారే అనుభవిం



చాలి. ఇలాటి పాపికి ఉపకారం చేస్తే, పాముకు పాలు పోస్తే దాని విషం వృద్ధి అయినట్టుగా, పాపం చుట్టుకుంటుంది. దీని గొడవ మన కెందుకు? మనం పోదాం పద," అన్నది.

"మోహినీ, నీ మాట నిజం కాదు. పరోపకారం ఎప్పుడూ మంచిదే," అంటూ రుక్మాంగదుడు తన పుణ్యాన్ని ఉడుముకు ధారపోశాడు. వెంటనే ఆ ఉడుము శరీరం నుంచి ఒక దివ్య స్త్రీ రూపం వెలువడి, వైకుంఠానికి వెళ్ళిపోయింది.

తరవాత రుక్మాంగదుడు మోహినీ సమేతుడై తన నగరం చేరుకుని తనవారి నందరినీ కలుసుకుని ఎంతో సంతోషం పొందాడు. ధర్మాంగదుడు చక్కగా రాజ్యపాలన సాగిస్తున్నట్టు పౌరముఖ్యుల వల్ల విని ఆయన తృప్తిపడ్డాడు.

తన తండ్రి కొత్తగా పెళ్ళాడి తెచ్చిన మోహినిని ధర్మాంగదుడు తన తల్లి లాగే చూసుకోవటమే గాక, తన తల్లి సంధ్యావళికి కలిగిన మానసిక వేదనను పోగొట్టి, ఆమె చేత మోహినికి సమస్త ఉపచారాలూ జరిగేటట్టు చూడమని ప్రేరేపించాడు.

ధర్మాంగదుడి ప్రవర్తన మోహినికి ఆశ్చర్యం కలిగించింది. అటువంటి సత్పురుషుడికి తాను ద్రోహం చెయ్యాలన్న ఆలోచన వస్తేనే ఆమెకు బాధ కలిగింది. రుక్మాంగదుడి ఇతర భార్యలు కూడా చాలా అసూయపడ్డారు. వారిని కూడా ధర్మాంగదుడు శాంతపరిచాడు.

మోహినికి కోపం వస్తుందేమో నని రుక్మాంగదుడు సంధ్యావళి కేసి చూడనైనా చూడటం లేదు. అది చూసి మోహిని ఆయనను తానే సంధ్యావళి ఇంటికి పంపింది. రుక్మాంగదుడి ఇతర భార్యలకు ధర్మాంగదుడు అంతులేని బంగారమూ, ఇతర వస్తువులూ కానుకలుగా ఇచ్చి వారిని తృప్తిపరచాడు.

ధర్మాంగదు డొకసారి మలయగిరికి సైన్య సమేతుడై వెళ్ళి, అక్కడి రాజులను గెలిచి, అయిదు మణులు తెచ్చాడు. ఒకటి బంగా రాన్నిస్తుంది, ఒకటి వస్త్రాలంకారాలిస్తుంది, ఒకటి యౌవనాన్నిస్తుంది, ఒకటి భవనా లిస్తుంది, ఒకటి ఆకాశగమనం మొదలైనవి ఇస్తుంది. ధర్మాంగదు డీ అయిదు మణు లనూ తన తండ్రి కిచ్చి, వాటిలో యౌవ నాన్నిచ్చే మణిని మోహిని కివ్వమన్నాడు.

రుక్మాంగదుడు తన కొడుకును వివాహం చేసుకోమన్నాడు. అందుచేత అతను వరుణుడి కుమార్తెనూ, నాగకన్యకలనూ వివాహమాడాడు.

రుక్మాంగదుడు మోహినిని తీసుకువచ్చి ఎనిమిదేళ్ళయింది. ఒకనాడు అయన మోహినితో కార్తికమాస వ్రతం చేద్దామనీ, మోహిని రకరకాల దానాలు చేయాలనీ, అన్ని దానాలలోకీ దీపదానం ఉత్తమ మయిందనీ అన్నాడు.

కార్తికమాస వ్రత విధాన మంతా విని మోహిని, "ఈ వ్రతాలు నా వల్ల కాదు. కావలిస్తే నీవూ, నీ పెద్ద భార్య సంధ్యావళీ కలిసి వ్రతం చేసుకోండి," అన్నది.

రుక్మాంగదుడు సంధ్యావళితో, "నేను మోహిని వ్యామోహంలోపడి చాలా ఏళ్ళుగా కార్తికమాస వ్రతం చెయ్యలేదు. ఈ యేడు



చేద్దామని ఉన్నది, నీతో కలిసి చేస్తాను," అన్నాడు. సంధ్యావళి సరే నన్నది.

కొంతకాలం గడిచింది. ఒకనాడు రుక్మాంగదుడు మోహినితో విహరిస్తూండగా, "ఏకాదశీ వ్రతం చెయ్యని వారు శిక్షించబడతారు," అని దండోరా వినిపించింది. రుక్మాంగదుడు మోహినితో ఏకాదశీ వ్రతం చేద్దామన్నాడు. మోహిని ఈ మాటకు మండిపడి, "నా పెండ్లికి ముందు నా కొక మాట ఇచ్చావు. అది నిలబెట్టుకో. లేకపోతే నీ వింతకు ముందు సంపాదించుకున్న పుణ్యమంతా బూదిలో పోసిన పన్నీ రవుతుంది. గర్భిణులూ, గృహస్థులూ, బలహీనులూ, శిశువులూ, యుద్ధం చేసేవాళ్ళూ, పతివ్రతలూ ఉపవాసాలు చెయ్యరాదని గౌతమ మహర్షి నాకు చెప్పాడు. నీవు ఉపవాసం ఉంటే నేను సహించలేను," అన్నది.

మోహినిని రుక్మాంగదు డెన్ని విధాలనో బతిమాలాడు. వ్రతం మానటం తప్ప ఇంకేది చెయ్యమన్నా చేస్తానన్నాడు. కాని మోహిని ఒప్పుకోలేదు. ఇలాటి వ్రతం వేదాలలో ఎక్కడా లేదన్నది. వేదాలలో లేనివి ఎన్నో విషయా లున్నా యన్నాడు రుక్మాంగదుడు. వేదాలలో చెప్పబడని ఎన్నో ఆచార వ్యవహారాలు పురాణేతిహాసాలలో ఉన్నాయన్నాడు.

"సర్వజ్ఞులైన బ్రాహ్మణులు వచ్చి నాతో వాదించినట్టయితే వారు నిన్ను భోజనం చెయ్యమంటారు," అన్నది మోహిని.

రుక్మాంగదుడు గౌతమమహర్షి మొదలైన వారిని పిలిపించాడు. వారితో మోహిని, అన్నం బ్రహ్మస్వరూపమనీ, దాని వల్లనే ప్రాణమూ, ప్రాణం చేతనే చేష్టా, చేష్ట వల్ల ధర్మాచరణా జరుగుతాయనీ, ప్రజారక్షకుడైన రాజు ఉపవాసాలు చెయ్యటం నరక కారణ మనీ వాదించింది. మోహిని చెప్పిన మాట వాస్తవమని గౌతముడు మొదలైన వారు ఒప్పుకున్నారు. —(ఇంకా ఉంది)



# 40. అరుణాలయం: సయామ్

సయామ్ రాజధానీ నగరమైన బాంగ్‌కాక్‌లో, మేనం నది పడమటి ఒడ్డున అత్యంత రమణీయమైన వాత్ అరుణ్ (అరుణాలయం) ఉన్నది. దీని ఎత్తు 300 అడుగులు. కట్టడ మంతా రంగురంగుల పింగాణీ పలకలు అమర్చబడి, ఎండలో రత్నాల లాగా మెరుస్తాయి. ఇది ప్రసిద్ధ బౌద్ధక్షేత్రం.



Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

నిలువెత్తు నా సామి

పంపినవారు:
డి. వి. కె. రావు, ఖమ్మం

Photo by S. V. Satyanarayana



బహుమతి
పొందిన వ్యాఖ్య

నిను చూసి మురిసేను

పంపినవారు :
డి. వి. కె. రావు, ఖమ్మం

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1965 మే నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫొటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నిలువెత్తు నా సామి

రెండవ ఫోటో : నిను చూసి మురిసేను

పంపినవారు : డి. వి. కృష్ణారావు, బి. ఎస్‌సి.,

ఖమ్మం.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'



# బ్రిటానియా
# గోల్డెన్ పఫ్




బ్రిటానియా వారే ప్రత్యేకంగా తయారుచేసే యీ గోల్డెన్ పఫ్ బిస్కట్లు తాజాగా కరకరలాడుతూ వుండి తృప్తినిచ్చును. కాఫీ, టీ, త్రాగేటప్పుడు సేవించుటకు అనువైనవి. జామ్, వెన్న, జున్నుంతో కూడ సేవించవచ్చును. రుచి చూడండి — నోట్లో కరిగిపోతాయి. నేడే కొనండి. కమ్మగా రుచిగా వుండే యీ తాజా బ్రిటానియా గోల్డెన్ పఫ్ బిస్కట్లను సేవించి ఆనందించండి.

## బ్రిటానియా
## బిస్కట్లు



# తలనొప్పి
ఎక్కువగా ఉన్నా
# తలకేగా!

# అమృతాంజనం వాడి
## శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పిఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృంతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబావి కంతాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధినిపొందిన నమ్మకమైన గృహఔషధం.

అమృతాంజన్ <u>నొప్పులు జలుబుల</u> నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/2875

